శ్రీ

# భాగవత మాహాత్మ్యము



రచయిత :

విద్వాన్ కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులు

# విజ్ఞాపనము



భాగవత మాహాత్మ్య మను నీకృతికి మూలము పద్మ పురాణము. ఇది గోకర్ణోపాఖ్యానము । మొదలగు చక్కని కథలతో, భాగవత, సప్తాహ సాంప్రదాయములను బోధించు చున్నది. భాగవతమును జదువ నెల్లరు నిది చదువ దగునని, తేట తెనుఁగునఁ గూర్చి, శ్రీ కోదండరామ చరణారవిందముల నర్పించితిని.

దీనిని సంతరించుటలో నొప్పుతప్పరసి తెల్పిన రసజ్ఞులు కవివరేణ్యులు నగు విద్వాన్ బ్రహ్మశ్రీ వెంపరాల సూర్య నారాయణ శాస్త్రిలవారికిని, అచ్చాంధ్రకవితా విశారదు లగు, బ్రహ్మశ్రీ చింతపల్లి రామకృష్ణమూర్తి శాస్త్రిలవారికిని నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

ఇట్లు,

గ్రంథకర్త.

# పుష్పమాలాబంధము.



చ. నరవర సారకారణ! గు ♦ ణప్రణయా! పరవీరదారణా
దర! ధరణీరమాయుత! న ♦ తశ్రితమానవ భావనా వశం
కర చరణారవింద! కవి ♦ కల్పక! మానసవాస! వాసనా

శ్రీ

# కృతిసమర్పణము

మక్కికి మక్కిగాక, ముని
 మాటల కోటలు దాటఁబోక, యే
దిక్కున నేని భక్తి కళ
 దిద్దెడు లేఖిని నాగనీక, నా
యక్కఱఁగాక పర్వముల
 యందునఁ జిందిన ధోరణిన్, గళా
దృక్కుల సంతరించితిఁ గృ
 తిన్ రఘునాథ పదాబ్జసంగతిన్.

తొలినోమిట్లు ఫలించె రాఘవుని నా
 థున్ జేసితిన్ నీకు; మం
జుల వృత్తంబులఁ, బూలశయ్యల; గుణ
 స్తోమంబులన్, వృత్తి రీ
తుల ద్రాక్షారస వాగ్ఝరీ మధురిమన్
 దోఁగించుచున్ నాథు నిం
పలరన్ జొక్కుచుఁ జొక్కసేయఁగద వ
 మ్మా! కావ్య కన్యామణీ!

నాకున్ లేవయనందుఁగల్గెఁ గృతికన్యారత్న మల్లారు ము
ద్దై, కొంతైనను శిశులోపమగు, నీకవమ్ముగ్ధ లీలా వినో
దాకల్పంబుల భావము ల్గమిచి నీకయానంద శయ్యా రసా
స్తోక ప్రౌఢిఁ గళారవిలాస విధులన్ కజొక్కింపరా! రాఘవా!

## —: ఖ డ్గ బం ధ ము :—




కం. శ్రీకరకరకమల ! కవిక
ళాకలితాద్భుత యశోవి లాస ! సుహాసా !
సాకేతాధిప ! రిపుజన
భీకరవరఖడ్గబంధ విహితోల్లాసా.

శ్రీ కోదండరామ సమర్పితమగు నీకృతిని ముద్రింపించి
యుచితముగా నొసఁగి సత్కరించిన

మహారాజశ్రీ

## ఈదర వెంకట్రావుపంతులుగారును,

వారి ధర్మపత్ని శ్రీ మహాలక్ష్మీసమానురాలగు

## శ్రీమతి సుబ్బమ్మాదేవిగారిని గూర్చియు

కవి యొనర్చిన

# ఆశీర్వాదము.

శ్రీమన్మత్కృతి పెండ్లికూఁతురయినన్ శృంగారవేషంబు ని
ట్లామోదంబుగ దిద్ది, నీ కరసరోజాలంబమున్ గూర్చి, నా
నోమున్ దీర్చినపుణ్యదంపతులకున్ దీర్ఘాయురారోగ్యభా
గ్యామోదంబిడి ప్రోవుమా! రఘుపతీ! ఆచంద్రతారార్కమున్

ఈఁదర పట్టిగాక మఱియెవ్వరు మత్కృతిలక్ష్మి నిట్లు నీ
పాదములందు నిల్పఁగలవారని తీవ్రతపంబుసేయ, ని
య్యాదరపట్టె బ్రహ్మకులుఁడీ కృతిభారము పూనెదానమై
మోదముకూఁతులం గనినపుణ్యుల కింతకు మించియున్నదే?

కోదండ రఘురామ పాదాంబుజధ్యాన
మకరంద మాని మైమఱచువారు;
ఆంధ్రభాషాలక్ష్మి కభినవాలంకార
కలనఁ బ్రొద్దెల్లనుం గడపువారు;

ఆశ్రిత కవికోటి - నద్భుతానంద ని
దాన దానాదృతిఁ - దనుపువారు
శమదమ క్షాంతి లక్షణ లక్షిత శ్రీల
నన్యోన్య మనురూపులైనవారు;
నైన వెంకటరాయ సుబ్బాంబి కాఖ్య
దంపతులు నీకుఁ బెండ్లి పెద్దరికమూని
ముద్దు సెల్లింప రఘురాము - ముద్దరాల
వైతి! ధన్యవు కావ్యకన్యాకుమారి!

తెలుఁగుం బిడ్డల కక్షరంపు గురుఁడున్ ధీమంతుఁడున్, బండితా
వళికిం బ్రాపును, రామభక్తిపరుఁడున్ - భాషారమారాధనా
లలితుండున్, ద్విజుఁ డీదరాన్వయకులాలంకారుఁ డభ్యున్నతిన్
వెలయుం గావుత మత్కృతీశ్వర కృపావిఖ్యాత దృక్చంద్రికన్.

శ్రీ లలరంగ వన్నెలును - జిన్నెలు దీరిచి, తీవి మప్పి, యీ
పోలిక నాదుకబ్బమను - పుత్తడి బొమ్మను బెండ్లికూఁతుగా
లీల నలంకరించి, సుఖ - లీనత నొందెడు సుబ్బమాంబ సా
ధ్వీలలనాశిరోమణికి - దీవన లిత్తురుగాక దేవతల్.

చెలివై యీగృహమేధి సంతతులకున్ జిన్నారి పొన్నారి ప
ల్కులు, నీ నీటు లొయారపు న్నడకలున్ గోదండ రామార్చనా
కలనన్ ముద్దుల పాటలో సొగసు, సా - కల్యంబుగా మప్పి యిం
పెలయున్ గావ్యకుమారి! ఆడుకొనవే - యే వేళ నిమ్మేడలన్.

శ్రీ శ్రీ శ్రీ



# భాగవతమాహాత్మ్యము

## అవతారిక



రాజన్నిజ నీల నీరద తను శ్రీ పైకొనన్ శాంభవీ
సారూప్యంబు గడించి సీత దరహాసంబూనఁ, దద్భాస వీ
చీ రోచిర్ధవలీకృతాకృతిఁ గృతాశ్లేషంబు లం దర్ధనా
రీ మాహేశ్వరుఁడైన భక్తనటునన్ శ్రీరామునింగొల్చెదన్.

## మదనగోపాలస్తుతి

సీ. వ్యత్యస్తపాద విన్యస్తి నూల్కొని రత్న
కాంచీకలాప మగ్గలము మెఱయ
మధురబింబాధరసుధఁ దోఁగితోఁగి, యిం
పొలసి వేణువు దివ్యకలలు గుఱియ
కనుదామరల సొగసతన మేర్పరించుచు
నిలువుకస్తురి రేక నీటు గులుక
అమృత ధారాధర శ్యామాకార మని బర్హి
బర్హావతంస విభ్రమము దెలుప

తే. గీ. పద్మవనమాల కౌస్తుభపదక మఱుత
వ్రేల లక్ష్మీసనాథుఁడై వెలయు భువన
విభుని జగదేక సుందర విగ్రహంబు
భక్తి భజియింతు మదనగోపాలమూర్తి.

### —♦ శబ్దబ్రహ్మస్తుతి ♦—

శా. శ్రీ వాణీయన మున్ను శ్రీ పలికి సుశ్లోకంబు పూర్వంగా, వాణి వి
ద్యావైశద్య మొసంగు శ్రీపదము శ్లోకార్థంబుగా వెల్గు వై
రావేశంబు లడంచి భక్త భరణ వ్యాసక్తి నేకాగ్రస
ద్భావ మ్మానుచు విశ్వతోముఖము శబ్దబ్రహ్మ మర్చించెదన్. 3

### —♦ బ్రహ్మస్తుతి ♦—

ఉ. ప్రాంతజగంబు మచ్చుగొని ప్రాంబలు కూర్త ఘటించి, చిత్రసం
ధాతవు నీవు సృష్టికవితారథ మంచిత నూత్న కల్పనో
పేత మొనర్తు వాదికవి విశ్రుత! పద్మజ! నిన్భజింతు నా
ప్రాంత పురాణపుం వెలుఁగు బల్కులఁ గ్రొత్తబెడంగు నింపుమా.

### —♦ విఘ్నేశ్వరస్తుతి ♦—

క. మూషికవాహను నుడురా
డ్భూషణు గజవదను నఖిల భువనజనమన
స్తోషణు నఘసంశోషణు
భూషింతున్ భక్తి కావ్యమును భాషింతున్. 5

### —♦ వాణీస్తుతి ♦—

మ. వరకాంచీగుణ కింకిణీ మణిగణ క్వాణంబు, నర్ధేందు సుం
దర సౌవర్ణ కిరీటకోటివిలసన్మాణిక్య రింఛోళియున్,
దరహాసామృత పూరితాధర సటన్నాసాగ్ర ముక్తామణి
స్ఫురణంబుం దగ మించు వాణి సొబగు న్భూషింతు వాగ్భూషలన్.

సీ. వలిపంపుఁ జీరపైఁ * గులుకు వెన్నెలమించు
మించి నెమ్మేను గ్రొమ్మెఱుఁగు లీన
మోము క్రొందమ్మిపై * మూఁగు తుమ్మెదల ది
మ్మదలించు చూపుల * యుదుటు తోఁప
మోవి కెంజిగు రాను * ముంగరము త్తెంబు
కళ నవ్వు నెల నవ్వు * మొలకలెత్త
తెలిపైట సరుల ము*త్తెముల నిగ్గులు దేలఁ
జెక్కుటద్దముల లేఁ*జెమట లొలయ

తే. గీ. శ్రీ విరాజిత మంజు మం*జీరమధుర
ఝణఝణత్కారరవము ధీ*జడిమ మాన్పఁ
గవిమనోఽంబుజసీమఁ దాం*డవ మొనర్చు
వాణి నజురాణిఁ బుస్తక * పాణిఁ గొలుతు. 7

## —♦ గురుస్తుతి ♦—

సీ. కనుదమ్ముల న్నవ్య*కరుణా సుధాధార
వర్షించు నద్భుత * వర్తనములు
నుభయభాషలఁ దేనె * లొలికించు సాహితీ
రస పాకములఁ దేర్చు * రంగములును
లౌకికాధ్యాత్మ కౌ*శలత్వ సాక్షాత్కార
కల నించు నానంద ♦ కల్పనములు
ప్రథిత గాయత్రీ జ*పస్ఫూర్తి సొబఁగీను
మోముఁ జూచినఁ గల్గు * బోధనములు:

తే. గీ. నా ధనము లయ్యె నే గురు । నాథ వాక్య
సాధనమ్మున నట్టి త । పోధనాగ్రి
గణ్యు దర్భాన్వవాయు బ్ర । హ్మణ్యుఁ బుణ్యు
యోగిజనమాన్యుఁ గొలుతు బై । రాగి గురుని. 8

ఉ. వంద లొసంగినం గొనఁడు । వాదముకై పిలువంగ రాఁడు, దా
నెందును సక్తి నిల్వఁడు, గ । ణింపఁడు తుచ్ఛములైన భోగముల్;
వందలు శిష్యు లాత్మపద । పద్మములం గొలువం గుమారు ల
ట్లిందఱఁజూచి పొంగు గురుఁ । డీయనకున్ సముఁ డింకఁ గల్గునే.

తే. గీ. కపటమెఱుఁగక పతిఁగొల్చుఁ, । గష్టసుఖము
లరసి పుత్రులయట్లు మ । మ్మాదరించు;
శాంతి దేవత మా గురు । కాంత లోక
వినుత వెంకటరత్నమాం । బికఁ దలంతు. 10

తే. గీ. బాల్యలీలల వాల్మీకి । పలుకుఁ గళల
నేను పారాయణానంద । నియతిఁ దేల;
మంత్రగురుఁడైన శ్రీరామ । మధురనామ
జపపరుంగొల్తు నప్పలా । చార్యబుధుని. 11

తే. గీ. అల శరద్రాత్రిఁ బండువె । న్నెలలఁ బిలిచి
చిఱుతవయసునఁ గవనంబు । తెఱవు దెలిపి
గణపతింగూర్చి కూర్పించెఁ । గంద మపుడె
యెన్ను దతని సుమాణ మ । ప్పన్నశాస్త్రి. 12

కం. లోకారాధ్యులు నిఖిల క
లాకలితులు భక్తిపరు లలౌకికపుణ్యా
శ్లోకులు మాతామహులన్
శ్రీ కంభంపాటి వంశ సిద్ధులఁ గొలుతున్. 13

కం. ప్రాక్తనుల నాధునికులన్
సూక్తినిధులఁ గవులఁ గొలిచి సువిమర్శకలా
సక్తుల భక్తుల మత్కృతి
తోక్తులు వినిపింతుఁ గుకవు లొత్తిగిలంగన్. 14

ఉ. లేఁతవయస్సునన్ జనని లేపిన మానసరాజహంస మా
పోతన వాక్సుధాలహరిఁ బొల్చిన సారము లానియాని వి
ద్యోతితమై ముకుందపద తోయజపీఠిక సోలివ్రాలి యే
కూఁతలు కూయునో యిపుడు కోవిదు లోపిక నోపి కావరే. 15

వ. అని యిష్టదేవతా గురు నమస్కార పూర్వకంబుగ సుకవి వినుతియుఁ గుకవినిక్కృతియు ననుసంధించి భక్తిభరితం బగు నొక్క ప్రబంధంబు రచింపఁ గుతూహలాయత్త చిత్తంబున దత్తావసరుఁడనై యుండి. 16

తే. గీ. అమరు లర్చింప నింద్రకీలాద్రి వెలసి
విజయుని తపోవిభూతికిన్ విజయ మొసఁగి
కరుణఁగురియించు భ్రమరాంబికాకామనోబ్జ
దినకరు స్మరు మల్లేశ్వరుని భజించి. 17

తే. గీ. తొలుత భృగువాసరమునఁ బ్రదోషవేళఁ
కరుణ యను తేనెఁ గన్నులఁ గడలుకొల్పు
కనకదుర్గాంబ నగుమోముఁ గాంచి కాంచి
బోధనానంద రసపరిప్లుతిని దోఁగి. 18

తే. గీ. తనివి నన కాలయాంగణమునసె నిలువ
మలయవాయుకిశోరంబు పొలసి పవన
తనయు సీతానగరవాసు మనసుఁ జేర్పు
మని యకారణమైత్రి బోధన మొనర్చ. 19

—♦ ఆంజనేయస్తుతి ♦—

శా. శ్రీసీతానగరీ ధరాధరదరీ రేఖాంచితోద్యాన పా
లీ సౌధాంతర నాట్యకల్పన కలాలీఢాంఘ్రి నధ్యాత్మదీ
క్షాసంధాయి శ్రితానుయాయి ధరణీజామాతృ పాదార్చన
వ్యాసక్తున్ హనుమంతు సంస్తుతితమోభాస్వంతు నెంతు న్మదిన్.

వ. అని వినుతిసేసి, నతిసేసి. 21

ఉ. ఆయెడ నెమ్మదిం బొడము హర్ష మనూనము గాఁగ నింటికిం
బోయి రఘుప్రభు న్మనసు పొందికఁ జేరిచి కన్నుమూయ నా
చాయల నంత్యయామమునఁ జక్కని తేజము గ్రమ్మె నందుఁ బ
ద్మాయతనేత్రు నిందుముఖు నర్భకు మోహనరూపుఁ జూచితిన్.

సీ. ఆ లేఁతనవ్వులోఁ బ్రాలేయ రుచిర శాం
తిరసంబు పొంగి యుప్పరము దాఁకె
ఆ చూపుబెళుకులోఁ నానందరస సుధా
జలధి యుప్పొంగి దిక్చక్ర మలమె
ఆ ముద్దుమోములోఁ నఖిలాబ్జజాండ లీ
లా చిత్ర చిత్రముల్ లాస్యమాడె
ఆ చేతిముద్రలోఁ నమల విజ్ఞాన బో
ధన కల్పనాకల్ప తతి చిగిర్చె

తే. గీ. అది కిశోరాకృతిం గొన్న యాత్మవిద్య
మదన సౌందర్య విభ్రమాస్పదము పరమ
మది యఖండకలాకృతి యట్టితోఁచె
శ్రీ శుకాకృతి మత్తప శ్శ్రీప్రసూతి. 23

తే. గీ. అటఁ బరీక్షిత్తు భాగవతాపణమున
యోగరత్న పరీక్ష కుద్యోగపడఁగ
నతని కఱచేత స్వర్గమ్ము ననువుపఱచు
ననఁగ జడధారి వింత బేహారి యయ్యె. 24

చ. కని కనులారఁ దత్తనువికాస విలాసము కన్నుమోడ్చి యే
మనుకొనినాఁడనో యెఱుఁగ నా సొబఁగా నగవా కటాక్షపుం
గనికర మా కపోలఫలకమ్ములఁ గ్రమ్ము నురుప్రకాశ మ
య్యనితర సౌమ్యదృశ్యమెదనంటి యదృశ్యమునయ్యె నయ్యెడన్. 26

వ. వేకువయైనంత.

క. వనిత యొకర్తుక పాద్మ
మ్మునఁగల భాగవత మహిమమును విని దానిన్
దెనిఁగించెనె పోతన యేఁ
యనువున నది లభ్యమానో యని ప్రశ్నింపఁగ. 27

క. 'లేదమ్మ' యంటి భావము
మాదృశులకుఁ దెలియునట్లు మఱి వ్రాయుఁ డటం
చాదరమున నని తరలఁగ
నాదట స్వప్నాదివృత్త మరసితి లోలోన్. 28

క. నా కలలో వార్త లహో
నా కల లో వార్త లయ్యెనా! బళి! తీరెన్
నాకల లోపము కృతిరచ
నాకల లోఁగొందు రార! నా రఘురామా! 29

వ. అని మదిష్ట దేవతామూర్తి యగు శ్రీరామమూర్తిని మత్కృతి పతింగా ననుసంధానించుకొని, 'భాగవత మాహాత్మ్య' మను గ్రంథమునకు మూలమగు పద్మపురాణము నెంచి. 30

—♦ పద్మపురాణ ప్రశంస ♦—

తే. గీ. హరికథానక దివ్యరసాయనంబు
గొలిపి భవరోగ తాపము ల్దొలఁచు నట్టి
పద్మ మది వ్యాస మావపోద్భవము దాని
భక్తి నెఱఁగుదు మన్మనఃపద్మమందు. 31

వ. అని మ్రొక్కి. 32

ఉ. పోతన దీని నా కొఱకుఁ ♦ బూనిక నిల్పి యనుగ్రహించె న
జ్ఞాత యుగంబుల న్నిలుచు ♦ సత్కృతినై కృతి గూర్చు రీతులన్
బూతచరిత్రుఁ డాదు నని ♦ పుణ్యకథానక మిద్ది నత్పురా
నీతసమస్త సత్కృతి గణించి రచించెద తల్లిబాసలో. 33

వ. అని నిశ్చయించి. 34

## —♦ వ్యాసస్తుతి ♦—

సీ. వేదవేదాంత పవిత్రతీర్థముల బ్ర
హ్మానందముగఁ జల్లులాడియాడి,
భగవన్ముఖేందుబింబమున జాల్వారు గీ
తావాక్యసుధ జగత్తతికిఁ బంచి,
జ్ఞానవిజ్ఞాన వసంతగానోత్సన
కృతిఁ బంచమశ్రుతిఁ ♦ గీలుకొలిపి,
యధ్యాత్మసూక్తి రసాత్మాంకుర చ్ఛాయలన్
బ్రహ్మసూత్రపురాణ ♦ ఫక్కిఁ బొదివి,

తే. గీ. సకలసార మసార సంసార భయ ని
వారకము భాగవతరూప ♦ పారిజాత
మవతరింపఁగఁ గారణ ♦ మయి తనర్చు
వ్యాసుని బరాశరాత్మజుం ♦ బ్రస్తుతింతు. 35

## —♦ శుకస్తుతి ♦—

తే. గీ. కర్మ మెడబాసి సన్న్యాస కలన నెటకొ
పోవఁ, దపియించి యెవ్వనిం బుత్ర! యనుచు
వ్యాసముని పిల్వఁ దరువు 'లో' యనుచుఁబలికె
నట్టి శుకుఁ గొల్తు నఖిల భూతాంతరాత్ము. 36

## —♦ పోతనస్తుతి ♦—

చం. అపరశుకావతార మల యాంధ్రసరస్వతి నోముపంట, స
త్తపములరాశి భక్తికవితారసవాహిని రామకల్పపా
దపసముపాసనాత్త పరతత్త్వ ఫలంబు దరిద్రదేవతా
క్షపిత దురంత సంసృతి నఖండ కళాకృతి నెంతు పోతనన్. 37

వ. అని సకలపాప పరిహర్తలును, భాగవత కథాప్రవర్తకులు నగు
యోగిసత్తములకు జోహారు లొసఁగి. 38

ఉ. వైదిక ధర్మ నిష్ఠ గల వంశమునందుఁ గవిత్వ మాత్ర సం
పాదన మిప్పట న్మిగిలె పాడఁబడె నాచరణంబు, నింక నీ
మాదిరి ధర్మసారము క్రమక్రమతం గడు పల్చనై రసం
బేదెడు నేమొ తద్రుచి గ్రహించెద వృద్ధ పదాబ్జ సేవనన్. 39

వ. అని స్వాహంకార పరిహారపూర్వకంబుగ, నెంచి; యాస్తిక్యప్రరో
చనా కరంబును, దురితహారంబు నగునని యస్మద్వంశాభిజన
వృత్తవిస్తరం బెఱిఁగింపఁ బూనితి నదెట్టులనిన. 40

## —♦ కవివంశావతార వర్ణనము ♦—



శా. శ్రీశైలంబు సమీప సీమ నలరున్ శ్రీమీఱు కల్లూరు; స
ర్వాశావిశ్రుతిమచ్ఛ్రుతిప్రతిహిత వ్యాపారు లద్వైత ని
ష్ఠాశీలు ల్హరిభక్తినిర్భరులు, శిష్యజ్ఞాన విజ్ఞానదీ
క్షా శిక్షానిపుణుల్ చరింతురట సాక్షాత్పద్మజుల్ సద్ద్విజుల్. 41

తే. గీ. వారె కౌండిన్యగోత్ర సంభవు లుదాత్త
భవ పదాంబుజ భక్తిసింధువులు బ్రహ్మ
భారవులు సాధువులు మాదు వంశ్యులగుచు
వరలినారలు కల్లూరివారనంగ. 42

మ. శివదీక్షాపరులైన రెడ్డినృపతుల్ శ్రీవీరభద్రేశ్వరో
త్సవ సన్నాహములన్ శ్రుతుల్వినుచు వాంఛం జేసి సర్వాగ్రహా
రవసుశ్రేణులఁ గాన్కలం గొలిపి కోరన్ గౌతమీ తీరసీ
మ వసింపం జని రగ్నిహోత్రములతో మా పూర్వు లేనాఁటనో.

ఉ. రాజులు పిల్వఁబంచి రని రారు ధనాశకుఁజిక్కి, బ్రహ్మతే
జోజిత చండభానులని చూడ నుపాయనపాణులై మహా
రాజులు నగ్నిహోత్ర గృహారాజిబడిం బడిగాపులైరి; యా
రాజులు యాజులుం గడచి రారిక నెన్నియుగాలు దొర్లినన్.

వ. అక్కట యొక్కింత వివరింతు; గౌతమీనది నట్టనడుమ పట్టసాచలం బను శివక్షేత్రంబు పురాణ ప్రసిద్ధమైనది గల దందు వీరభద్రేశ్వరుండు దక్షాధ్వరవిధ్వంసనానంతరము నసముద్రగకోపానల

జాజ్వల్యమానాకారుండై యున్నం గని, యద్దేవు సనునయించు
నదియుంబోలె. 45

చ. అలలను చేతులం బొదివి ♦ యల్లనఁ గౌఁగిలిఁ దార్చి, తెమ్మెరన్
జలువలఁ జిమ్ము తుంపురులఁ ♦ జక్కఁ స్పృశించుచు సేద దేర్చుచున్
గలకల మంగళధ్వని ని♦నాయము నించుచు రాజహంసముల్
జెలులుగఁగూర్చి యాతని భ♦జించును గౌతమి యెల్లప్రొద్దులన్.

తే. గీ. యాగవిధ్వంసనోగ్ర♦క్రోధపాగ్ని జగము
భస్మమొనరింతు నను వీర♦భద్రమూర్తి
దుడుకు శమియింప గౌతమి ♦ కడుపుఁజలువ
కారణం బయ్యెఁ గాకున్నఁ ♦ గలదె దిక్కు. 47

వ. ఏతాదృశ మహిమావిభూతిఁ బొలుచు కరుణాసముద్ర విహి
తాఖిలభద్ర వీరభద్ర సేవించి త్రిలిఙ్గ సామ్రాజ్య ధూర్వ
హు లైన రెడ్డిరాజులు స్వామికి నిత్యధూపదీప నై వేద్యాది
లలితోపచార సమర్చనమున కగ్రహారాది సమర్పణం బొనరించి
యకందర్పదర్పదమను నమందభక్తిసుందరముగ సేవించుచుఁ
దదాలయ ప్రాకార గోపుర నిర్మాణంబులు గావించి రయ్యెడ.

సీ. ఉక్కుచెక్కిన నొక్క ♦ ముక్కరాలదు పండు
టిటుక నే సొల్లు వేయించినారొ
వజ్రంబు రాపిడి ♦ వట్టినన్ వ్రీలని
యీ సున్న మెట్లు పూయించినారొ

కనుజూపు జారు నీ । నునుపుఁ బాషాణాల
నే కొండఁ దవ్వి రప్పించినారొ
ఉలినాటులకుఁ గాని । జిలుఁగైన నగిషీల
కే శిల్పులకు నెంత । యిచ్చినారొ

తే. గీ. శివునిపై బత్తి శివమెత్తి । చెమట లొత్తి
కత్తి పదనిడి యరిరాజ । కనకసౌధ
భిత్తికల అంపపుంగోఁత । లొత్తి రజను
రాల్చి కరఁగించి యతికి రీ । రాతి గుడులు. 49

వ. మఱియు నందు. 50

తే. గీ. వరుసఁ బ్రాగ్దక్షిణోత్తర । ద్వారములను
స్వస్తి వినిపింపఁ దత్తద్ది । శాంతరముల
నలరు సుక్షేత్ర ఖండిక । లగ్రహార
ములుగ నిచ్చిరి విప్రోత్త । ములకు రెడ్లు. 51

తే. గీ. అవియె కుకునూరు వీరభ । ద్రాగ్రహార
ములుగఁ దరతరముల నూఱు । పుట్లభూమి
భుక్తి మొనరించుకొందు మి । ప్పుడును నాఁటి
వేదపూర్ణాధికారుల । పేరు సెప్పి. 52

వ. ఇట్లా రాజుల వలన యదృచ్ఛాలాభసంతుష్టిం బ్రహృష్టులగు నా
భూసురులు వాసగ్రాసవాసోదైన్యంబు లెఱుంగక, దేవ భూ
దేవుల హవిర్దానాన్నదానంబుల నారాధించి యానందించుచు

నయ్యీశ్వరాలయ దక్షిణద్వారము నాశ్రయించి, యటకుఁ గ్రోశ త్రయమాత్రమున గోదావరీతీరమున నుండు తాళ్లపూడి యను నగ్రహారమున వసియించుచుండి రట్లు. 53

సీ. అశ్వమేధాంత మహాయాగ దీక్షలు
నడిపించు విప్రులం దడరువారు
యజ్ఞసంభారము లందీయఁ గ్రతుశాల
నృపులు సమ్మర్దంబు నెఱపువారు
తలలోని నాల్కలై కలిమిలేములు పంచు
కొను మైత్రి వైశ్యులు మనెడివారు
అడుగులంటుచు నొక్కయడుగు దాటక యాన
లరసి శూద్రులు భక్తి నెరపువారు

తే. గీ. కాకయుండిన జరిగెనే గంజికాల్వ
గౌతమీ గర్భ పంకంబు గాంచునంత
యన్నదానంబు వాజపేయాదియజ్ఞ
పూర్ణ దీక్షల మా తాళ్ళపూడియందు. 54

మ. శ్రుతిగానంబుల సంగతిన్ వెడలి, యిచ్చో దక్షిణాశానిలో
ద్గత గోదావరి వీచికాంతరస ము త్కంపి స్వరాలీనతన్
జత గూర్చున్ నిఖిలాప్సరోవర నటీసంగీతకంబున్ శుభా
యతి స్వాహేతి నిలింప నాయక సమాహ్వానప్రశంసార్భటుల్. 55

ఉ. గౌతమిఁ దానమాడి నదిగట్టున బిల్వము తుమ్మిపూవులున్
శ్రీతులసీదళంబు లభిషేకజలంబులఁ బూని బ్రహ్మవి
ద్యాతరళాస్య దీధితులు నంబుజబాంధవు చెల్మి సేయ సం
ప్రీతి నుమేశు సన్నిధి జపించి భజింతురు విప్రు లప్పురిన్. 56

వ. అట నయ్యుమామహేశ్వరస్వామియు. 57

సీ. స్వర మింత పొరబాటునడకుండఁగా విప్ర
వటులతో వేదముల్ వల్లెవేసె
ప్రక్రియావిధి శంక వాయ వ్యాకరణమ్ము
తెఱచి బాలురకుఁ జింతనము సెప్పె
సిద్ధాంతముల బుద్ధి చెదరకుంటకు బ్రహ్మ
మహిమానుభూతి మీమాంస సేసె
మంత్రక్రియార్థ సంబంధమ్ములన్ శంక
లణఁగింప శ్రౌతభాష్యములు విప్పె

తే. గీ. ఆలయపురఃప్రఘాణ మందరగిపోవు
కఠిన పాషాణ వితతి కేకళలురాఁగ
సందియమె యయ్యుమేశుఁ డాచార్యమూర్తి
గాఁగ విప్రార్భకులు కళాకలితు లగుట. 58

వ. అందు. 59

సీ. పట్టసాచలవీరభద్రేశ్వరాలయ
దక్షిణ ద్వారంబు తలుపుతట్టి
గోదావరీలహరీద్రుత స్వనమాధు
రీశ్రుతిన్ శ్రుతిగానరీతి వినిచి

శ్రుతిశిర స్సిద్ధాంత । సతత సంచారిణిన్
భద్రకాళీదేవిఁ । బలుకరించి
వీరేశ్వరుని జూచి । బెదరు దేవకుమార
మునులకు న్మంత్రవిభూతి పెట్టి

తే. గీ. పర్వదినముల శ్రీ వీరభద్రచరణ
సరసిజము నీడ యోగ నిష్ఠలఁ జరించి
వచ్చుచుండిరి శ్రీ వీరభద్రపుర వి
ధాతలౌ మాదు తాత ముత్తాత లెల్ల. 60

వ. మఱియు నచట. 61

తే. గీ. శంభులింగోద్భవానంద । సమయ మరసి
తన్మయత నొంది దక్షిణద్వారవీథి
ఘన వచింపఁగ ఘనఘనాఘననినాద
చటుల గంభీర రవము దిక్తటుల మ్రోయు. 62

సీ. రాజగృహద్వార । రాజిఁ జేరరు భక్త
గణన శంకరు గృహాంగణముఁ గాని
రాజోపచార సారముఁ గోర రింతయుఁ
రాజశేఖరు కృపారసముఁ గాని
నృపుల సంస్తుతిఁ జేయ । రెన్నఁడుఁ శ్రుతిగీతి
కల నీశు వినుతించు । కలుకుఁ గాని
ప్రభులతో మంత్రతంత్రము లూన రేనాఁడు
వీరభద్రుని మంత్ర । విధులఁ గాని

తే. గీ. హరుని లోఁజూపులం జూతు రంతె కాని
చూడ రెన్నఁడు దృశ్యంబు చూపు విప్పి
త్రిపురహరపద పద్మ భక్తి ప్రసిద్ధ
సిద్ధులైనట్టి మా వంశవృద్ధులెల్ల. 63

వ. అట్టి మహానుభావుల పరంపరయందు. 64

తే. గీ. వైదికాచార నిరతుండు బ్రహ్మపద వి
హారధీరుఁడు దుర్జయుం డాహితాగ్ని
దాత క్రతునేత సాధుసంత్రాత ధర్మ
శూరుఁడై యొప్పె శ్రీరామ సోమయాజి. 65

తే. గీ. పత్ని వెంకమ సోమిదేవమ్మ యగుచు
నధ్వరములందు నతిథిపూజాదులందు
ననవరతభక్తి హితయుక్తి నలపు సొలపు
నెఱుఁగ కాతనిఁ గొలిచి గడించెఁ గీర్తి. 66

కం. ఆఱుగురు పుత్రికలును ను
దారయశస్వినులు మఱియుఁ దనయుం డొకఁడున్
వారికిఁ గల్గిరి తత్త
త్పారంపర్యంబు వంశపావన మయ్యెన్. 67

వ. అం దా కుమారుఁడు. 68

ఉ. ధీరుఁడు, నాహితాగ్ని, యతి§థివ్రజపూజనతత్పరుండు, వి
స్తారయశుండు, సాధుగుణ § శాలి, యుమారమణాంఘ్రిభక్తి దీ
ప్తారసికుం, డమాయికుఁడు§శాంతరసాకృతి, యాత్మవేత్త యన్
బేరు గడించి యింపెసఁగె § వేంకటసుబ్బయదీక్షితాఖ్యుఁడై. 69

చ. పతిహితవర్తనం బతిథి§బాంధవపూజన మార్యధర్మ సం
గతి యలరార నాతని న§కల్మషభక్తి భజించి కీర్తి ను
ద్గతి గొనె వెంకమాంబ మఱి § తద్వ్రతనిష్ఠకు శాంతికిన్ నయా
దృతికిని ధన్యవాదము ప§ఠించెద రిప్పటి వృద్ధ భామినుల్. 70

వ. ఇట్లలరారు నప్పుణ్యదంపతులకుఁ జిరకాలము సంతతి గలుగకున్న
నరసి శ్రీరామసోమయాజి. 71

ఉ. ఇష్టమతి న్మహాక్రతువు § నిమ్ముగఁజేయుచు నందుఁ బుత్రికా
మేష్టి నొనర్చి పాయసము § నిచ్చెను, దన్మహిమానుభూతి వి
స్పష్టయశుం డుదారమతి§బ్రాహ్మ్యమహఃపరిపూర్ణమూర్తియున్
శిష్టజనానుయాయి ఋజు§శీలి కుమారుఁడు గల్గె వారికిన్. 72

తే. గీ. దేవకీనందన యతీంద్ర § దివ్యచరణ
సరసిజామోద భక్తి వి§స్తరుఁ డతండు,
కార్యశూరుఁడు ధీరుఁ డ§కల్మషుండు
యజ్ఞఫలమూర్తి, భోగేశ్వ§రాఖ్యుఁ డనరె. 73

మ. హరిభక్తిన్ సతి రామలక్ష్మి తనతోడై హర్షముం బెంప నీ
శ్వర గాథామృత లీనుఁడై పొగసి యీ భాగ్యంబు నా బిడ్డ లె
ల్లరకుం గల్గెడునంచు శుద్ధమతిఁ గొల్వన్ నేర్చెఁ, గాకున్న శ్రీ
వరలీలాదృతి వారిసంతతికి లభ్యంబౌనె యీ పాటిగన్. 74

ఉ. పుట్టినదాది భాగవతపుణ్య కథా శ్రుతి శౌరి నెమ్మదిన్
గట్టిన భక్తురాలు హరికల్పసమాశ్రియ మంగమాంబచేఁ
దట్టిన చిత్కళాసరసితత్త్వసుధాంబుధి రామలక్ష్మి యి
ట్టట్టనరాని భాగ్య మది యా సతికిన్ సుతులై జనించుటల్. 75

తే. గీ. వారికి న్మువ్వు రాత్మజుల్ వరలినార
మరయ నేనును, వీరభద్రాహ్వయుండు,
సూర్యనారాయణాఖ్యుఁడు సుజనవర కృ
పాభిలాషుల; మిందు నే నగ్రజుండ. 76

కం. వెంకట సుబ్రహ్మణ్య ప
దాంకుఁడ మఱి దీక్షితాఖ్య యది పెట్టిన పే
రింకఁ బయి మా పితామహు
సంకము వలె నదియు సార్థ మా హరికరుణన్. 77

మ. తలిదండ్రుల్ హరిభక్తి సప్తదినగాథా యజ్ఞ దీక్షాప్తిఁ బు
ల్యాల నారాయణ శాస్త్రివర్యుల కథాలాపామృతం బొని, రా
ఘలమే నావలనన్ శుకోక్తిమహిమన్ బాడించు, మాతమ్ముఁడున్
సలుపున్ భాగవతంబు సప్తదిన దీక్షల్ వీరభద్రాఖ్యుఁడై. 78

వ. ఇది మదీయ వంశ విస్తరం బిఁక. 79

## కోదండరామస్తుతి

శ్లో. అంసాలంకృతహేమచాపలలితం తూణీద్వయాలంకృతమ్
కోటీరాంగద తారహార రుచిరం స్మేరాననాంభోరుహమ్
రక్షశ్శిక్షణ దక్ష మాశ్రితజన క్షేమంకరప్రక్రియమ్
సీతాలక్ష్మణ వాయుసూనుసహితం కోదండరామంభజే. 80

వ. అని వినుతించి. 81

## షష్ఠ్యంతములు

క. మోదమున నొంటిమిట్టను
బ్రాదుర్భావమ్ము నొంది ‡ భాగవతకృతి
శ్రద్దయితుఁ డగుచుఁ బోతన
పై దయ వర్షించినట్టి ‡ భద్రాకృతికిన్. 82

క. కోదండరామునకు హర
కోదండ విఖండనునకు ‡ గుణసదనునకున్
వేదండ గమనునకు స్వభు
జాదండ హత ద్విష త్ప్రచండబలునకున్. 83

క. రామునకు రూపనిర్జిత
కామున కభిరామ సకల ‡ కల్యాణగుణ
స్తోమునకు రవికులాంబుధి
సోమునకున్ విశ్వవినుత ‡ శుభనామునకున్. 84

క. ధీరునకు జానకీ హృ
చ్చోరునకున్ ద్విజగదేక ॥ శూరున కతిగం
భీరునకు భీరుజనతా
ధారునకున్ శాంతిరస సుధాసారునకున్. 85

క. దాశరథికి నిరవధిక కృ
పాశరథికి భ్రుకుటిమాత్ర ॥ భగ్నీకృతలం
కేశరథికి భుజకలిత మ
హాశరథికి శరధిబంధనాద్భుత విధికిన్. 86

క. విధికలిత ధర్మ నిరతికి
విధిరుద్రాద్యమర వినుతి ॥ విదితోన్నతికిన్
మథితాఖిల దుష్కృతికిన్
మధురాకృతి కార్యలోక ॥ మంగళగతికిన్. 87

వ. శ్రీరామమూర్తికి సమర్పితంబుగా నా యొనర్పం బూనిన 'భాగవత మాహాత్మ్య' మను ప్రబంధమునకుఁ గథావిధానం బెట్టిదనిన. 88

## కథా ప్రారంభము

చ. నిరుపమ శేముషీకలితు నిర్మలినాంతరు సూతు నైమిశాం
తరరుచిరాశ్రమాస్థితుని దార్కొని, భక్తి వినమ్రభావ వి
స్ఫురణమునన్ నతుల్ సలిపి పుణ్యకథామృతపాన చాతురీ
నిరతుఁడు శౌనకుండనె మునిప్రవరుల్ ముదమంది మేలనన్. 89

కం. సూతా! అజ్ఞానతమో
వ్రాతనిరాకరణ కోటిభానుద్యుతి వి
ఖ్యాతా! నిఖిల పురాణ క
థాతత్త్వాఖ్యాన నిపుణ! ధర్మధురీణా! 90

శా. భక్తి జ్ఞాన విరాగముల్ గదియఁ ప్రాప్తంబా వివేకంబదే
యుక్తిన్ బెంపుగడించు? వైష్ణవులు మాయోద్రేక నిర్బంధ మే
శక్తిన్ ద్రెంచుకొనంగ నేర్తురో కదే! సందేహ మేదన్ శుభా
సక్తిన్ వీనుల విందుసేయుము సుధాసారానుకారోక్తులన్. 91

చం. కలి యరుదేర జీవులకుఁ గల్గును రాక్షసవృత్తి, యార్తి సం
కలనమునన్ గ్రసింపఁబడుఁ గాదె జగద్వలయమ్ము, తద్వ్యథా
జ్వలనము నార్పు జీవపర వస్తువివేక రసప్రవర్ష మె
వ్వలన లభించునో తెలియఁ బల్కు మనూనదయారసోదయా!

తే. గీ. శ్రేయములకెల్ల నెయ్యది శ్రేయ, మఖిల
పావనంబుల కెయ్యది పావనంబు
శౌరిసంప్రాప్తి కెయ్యది సాధనంబు
నట్టి గతిఁ జెప్పు నీవ కా కన్యులెవరు? 93

తే. గీ. సురల యేలిక స్వర్గంబు - సిరులఁ గురియు
వేల్పుమణి గూర్చు లౌకిక - విషయ సుఖము
గురువౌనఁగ నేర్చుఁ బ్రేమసం - భరితుఁడగుచు
యోగి కందని వైకుంఠ - భోగపదము. 94

వ. అనిన సూతుఁడిట్లనియె. 95

ఉ. ఇంతటిప్రీతి నీకుఁగల - దేని యిదే వివరింతు సర్వ సి
ద్ధాంతపయోధులం దఱువ - దక్కిన నవ్యసుధారసంబు శ్రీ
కాంతకథాకలాపమది - గాకిఁక సాధన మన్యమున్న దే
స్వాంతము శుద్ధిసేయ మఱి - సంసృతితాపభరంబు వాపఁగన్. 96

శా. కాలవ్యాళముఖాగ్రనిర్గత విషో - గ్రజ్వాల లాభీలతన్
గ్రాలం గ్రాగి జనమ్ము లవ్విగడువం - గాలేక యల్లాడినన్
జాలిం జూచి శుకుండు భాగవతదీ - క్షన్ శాంతి వర్షించె; వి
శ్వాలంకారము తత్కథామహిమ మీ - వాలించితే శౌనకా! 97

వ. మున్నొకమాఱు. 98

చ. తమ పనిఁ జక్కఁబెట్టుకొను - దారుల నేఱుపుగొన్న వేల్పు ల
య్యమృతముఁ బూనివచ్చి, వసు - ధాధిపు కొల్వున విష్ణుగాథ లిం
పమర వచించు శ్రీశుకమ - హామునిసన్నిధిఁజేరి, తత్పదా
బ్జములకు మ్రొక్కి, యిట్లని ర - పారభయాభినయ ప్రపత్తులన్. 99

ఉ. ఈ సుధ నిత్తు మివ్వసుమతీశ్వరుఁ డియ్యదిగోరి పారిజ్యరా
జ్యాసమభోగ భాగ్యరుచి యానుచు మృత్యువుఁ దప్పు, శాపసం
తాపసమువీడు, నీహరికథామధురామృత మద్ది మాకు ని
మ్మా! సముదాత్త సత్కృపఁ గృతార్థులమై చనువార మేమునున్.

చ. అన విని, మోముఁదమ్మిపయి హాస్యరసాంకురదోహదంబుగా
ముని దరహాసముల్ చిలికి, పోల్చి నిలింపుల భక్తిలోప, మి
ట్లనె నమృతం బదేడ సరసార్థ గభీరములైన నందనం
దన చరితంబు లేడ రతనంబుఁ దలంతురె గాజుముక్కఁగన్. 101

సీ. రంభాది నిఖిలాప్సరః పరీరంభ స
మారంభములఁ గోర్కె లణఁగలేదు
స్వర్లోకపరిపంథి పాటవోత్పాట నో
ద్ధతి రేగు క్రోధంబు తగ్గలేదు
నిర్భరానంద సందర్భ గర్భితములౌ
స్వర్భోగములఁ దమి సడలలేదు
అమరాధికార దుర్మద మహాహంకార
పదవిపై మోహంబు వదలలేదు
తే. గీ. పుణ్యలోక సుఖాభోగ భుక్తిఁ గదియు
మదము మాత్సర్య మింతయున్ మాయలేదు
అమృతమది త్రావి త్రావి మీ రందుకొన్న
యద్వయానంద పద మేమి యమరులార! 102

తే. గీ. నిర్భయానందకరమును § నిఖిలకలుష
హారము భాగవతాఖ్య మహాప్రసాద
మమృత వినిమయమాత్రలభ్యం బటంచు
నడుగవత్తురె యన సురల్ § బిడియపడిరి. 103

చ. ఇది వినుటం బరీక్షి దవనీశుఁడు మోక్షము నారలాడె స
ప్తదినములన్ విచిత్రమని § బ్రహ్మ తులన్ ఘటియించిదీని, ము
న్నొకదవినముక్తిసాధనము § లోకెక్కడనుంచియుఁ, దూచెగౌరవా
స్పదమయి యందుమొగ్గెసట § భాగవతంబు ప్రభావసంపదన్.

తే. గీ. భగవదాకారమే భువి § భాగవతము
చదువ వినినను వైకుంఠ § పదము దొరకు
ననుచు మునిముఖ్యులందఱు § హర్షవిస్మ
యాత్ములైరంత సత్యలోకాంతరమున. 105

క. మును ధాతవలనఁ దా విని
యును సూక్ష్మమ్మనను మోక్షమొసఁగెడు నని దీ
నిని నారదముని వినియెన్
సనకాదులవలన విష్ణు § సప్తాహవిధిన్. 106

వ. అనిన సూతునకు శౌనకుం డిట్లనియె. 107

ఉ. ఎత్తిన పాద మెత్తినటులే తిరుగాడెడు లోకవిగ్రహ
యత్తుఁడు నారదుండు సనకాదులు నాతఁడు నెందుఁ గూడి రా
తత్తరగాని కెక్కథ యథావిధి నెయ్యెడ వించినార ల
య్యుత్తము లక్కథావిభవమూది వచింపుము రోమహర్షణీ !

వ. అన సూతుఁ డిట్లని చెప్పందొడంగె. 109

ఆ. వె. శుకుఁడు శిష్యుఁడ నని । శోధించి శోధించి
భక్తిపోషకంబు । పావనంబు
నా కథానకంబు । నేకాంతమునఁదెల్పె
వినఁ గదయ్య దాని । విస్తరింతు. 110

చ. అలరు విశాల యన్నగరమయ్యెడకున్ సనకాదియోగి చం
ద్రులు మును సాధుసంగమకుతూహలురై చని యందుఁజూచి య
న్నలువకుమారు నారదు ధనంబుడివోయిన పేదవోలె వి
హ్వలుఁడయిశూన్యచిత్తుఁడయి వందురుచుండఁగఁ బల్కిరివ్విధిన్.

చ. కలుగదు సక్తి యెందును, వికారము లంటవు నిన్ను, బ్రహ్మవే
త్తల తలమానికంబవుగదా! వలదా మది శాంతి? యేలొకో
కలకయొసంగఁ దోఁచెదు, ముఖంబున దైన్యము తాండవించెడిన్
గలతెఱఁ గేమొఱుంగఁదగునా? పలుకన్ మఱి నీకుఁ జెల్లునా! 112

వ. అనిన విని యా దేవముని వారల కిట్లనియె. 113

కం. ధరణి సర్వోత్తమం బని
యరసి యరసి దరిసి దరిసి । యయ్యై యెడలన్
గిరిదరి సరిత్సరః పరి
సరపుణ్యాశ్రమ విహార । సంరంభుఁడనై. 114

మ. తనివారన్ గురుకాశి పుష్కర హరిద్వార ప్రయాగంబులన్
గని, గంగాది తరంగిణీ సలిల సంగం బంది, శ్రీరంగ ధా
ముని సేవించి, యమందభక్తి భరితంబుల్ వింటి నాసేతు శీ
తనగాంత స్సరసీసరిత్తట పవిత్రక్షేత్ర మాహాత్మ్యముల్. 115

కం. నదులన్ నదముల బహుజన
పదములఁ బొదలినను హృదయ పదమున నొకయిం
పొదవదు సుఖలేశ మ్మె
య్యదనునఁ గుదురదు గదా! మహామునులారా! 116

—♦ నారదుఁడు కలిచర్యలను దెలుపుట ♦—

చ. కలికృత దోషసంకలనఁ గ్రాలు నిలావలయంబునందు నె
వ్వలనున సత్యమున్ దయ తపంబును శౌచము దానధర్మముల్
గలుగవు, గుడ్డిగవ్వ కొఱగా రుదరంభరు లౌచు నీచులన్
గొలుతురు కూటసాక్ష్యములకు న్వెనుదీయరు మానవాధముల్.

కం. సోమరిపోతులు, నిష్ఠయు
నీమము గలవారుగారు నిర్భాగ్యులు దు
ష్కామాది శత్రు పీడితు
లే మూల నుపద్రవమ్ములే చెలఁగాడున్. 118

సీ. మంచివాఁడని పల్కరించుచో నాస్తిక
వాదానల జ్వాల ప్రజ్వలించు,
ఇతఁడు విరాగియౌ లేయన్న వాకట్టి
కూర్చుకొన్న ధనంబు గొల్లగొట్టు,

పడతి ప్రాణేశ్వరుం బడుగుగాఁ గని తానె
యింట రాజ్యము చెలాయించుచుండు
భార్యతమ్ముఁడు గృహపతికి బుద్ధులు సెప్పి
నడపి యాడించు నాగడపు బడుల

తే. గీ. కామపరతనో, దంపతుల్ కలహమాత్ర
జీవనముననో ప్రొద్దులు చింపుకొందు
రైహికాముష్మికాలక్ష్య మడఁగి పెండ్లి
యాటలన్నియు వట్టి సయ్యాటలౌను. 119

మ. కడుపారంగని ముద్దుకూతురుల రాగంబేది యెయ్యేటనో
విడువం జంకక, యేఁటి కొక్కధరగా బేరాలుసాగించి యం
గడి మూఁకన్ మఱికుంటి గుడ్డియను శంకన్ వీడి యమ్మంగఁ బా
ల్పడి రాబట్టను జేతఁబట్టుకొను దౌర్భాగ్యంపుఁ గన్యాపితల్.120

మ. కలుగం డెందునుయోగి, సిద్ధుఁడనఁగాఁ గన్పట్టఁ డెవ్వాఁడు, ని
స్తుల విజ్ఞాన కథావినోదములు నెందున్ లేవు, మోక్షేచ్ఛకున్
వలనౌ మానవుఁడే కనంబడఁడు, కైవల్యాప్తికిన్ సాధనల్
కలిదావానల దహ్యమానములు కాఁగా దోఁప వా వాసనల్.

తే. గీ. ఆశ్రమమ్ముల సదులఁ దీర్థావళులను
యవన వైరానల జ్వాల లావరించెఁ
జెడెను దేవాలయములు ముష్కరులకతనఁ
గలికృతానల్పదోషసంకల్పమే మొ. 122

ఉ. అన్నపుటంగడుల్ విరిసె ఽ నక్కట! పల్లెలఁగూడ, మూర్ఖుల
న్నన్న! ద్విజాధముల్ శ్రుతుల ఽ నమ్ము గడింతురు కానికాని గా,
నన్నువ లాత్మమానముల ఽ నక్కట కారడిమూఁక కమ్ముగా
నెన్నుదు; రింతకంటె కల ఽ వే కలికాల దురంతవైఖరుల్. 123

—♦ నారదుఁడు బృందావనమున కేగుట ♦—

చ. ఇటు కలిదోషముల్ గనుచు ఽ నిట్టటు నేఁ దిరుగాడి, యంతనం
తటఁ జని, గోపికాప్రియ ఽ నాయక వేణువినోద మేదుర
స్ఫుట నటనా కలాప పరి ఽ శోభిత దిక్తల మా కళిందజా
తటమును జేరుకొంటిని గ ఽ తవ్యథుఁడయ్యెదనంచుఁ బొంగితిన్. 124

వ. ఇట్లేగి. 125

సీ. ఇందెకాఁబోలు మా ఽ యిందీవర శ్యాముఁ
డాల మేపుచు నాట ఽ లాడమరగె
నిందెకాఁబోలు మా ఽ నందనందనుఁడు దా
విశ్వమోహనగాన ఽ వితతి నినిచె
నిందెకాఁబోలు మా ఽ యిందిరారమణుండు
రాసలీలావిహా ఽ రములు సలిపె
నిందె కాఁబోలు బ్రహ్మానందరసమూర్తి
వ్రజవధూ శృంగార ఽ వార్ధిఁ దేలె

తే. గీ. నిందుఁ దాఁ జల్దిగుడిచె, ము ఽ న్నిందునిలిచె,
నిందు శయనించె, సరసమ్ము ఽ లిందుజరిపె,
ననుచు స్వానుభవైక గ ఽ మ్యంబులైన
తావు లవి చూచి తన్మయ ఽ త్వంబు నొంది. 126

తే. గీ. పారిజాతంబుగొడవ మున్ భామకోప
మపనయింపఁగ నొక మార్గ మరయఁగోరి
మాధవుఁడు నేను డాఁగిన మాధవీ ని
కుంజ మది చూచి కన్నీరు గుర్తిస్మరించి. 127

సీ. హరిపాదములజాడ లరయు వేడుక గూరి
యమునానదీ పులినములఁ జేరి
శౌరిశృంగారలీలారంగము లటంచు
సుమనోలతా నికుంజములఁ దూరి
వ్రజవధూహృదయ చోరగ్రామణిం బట్టఁ
దరులతాగహన సంతతులఁదారి
సామగానవినోదు సరసవేణునినాద
మాకళింపఁగ బయ లాలకించి
తే. గీ. అచ్యుతానంత! గోవింద! హరి! ముకుంద!
జలజలోచన! రమ్మని పిలిచి పిలిచి,
యేను దా నొక్కఁడై చరించినట్టి
జాడలనుజూచి హరి నెందుఁ జూడనైతి. 128

వ. ఇట్లేగియేగి ముందట. 129

—♦ నారదుఁడు భక్తికాంతనుగని సంభాషించుట ♦—

తే. గీ. బడుగు లిద్దరు తనపజ్జఁ బడి కృశింపఁ
బడఁతు లెవ్వరో యుపచార పరతఁ గొంత
శాంతివచనంబు లాడుచుఁ జెంతనిలువఁ
గడు తపించెడు నొక కాంతఁ గంటి నంత. 130

ఉ. చందురుఁబోలు మోముపయిఁ జాల్కొనె నయ్యలకల్ కళంక రే
ఖం; దొరఁగెన్ గరంగి తిలకంబు, కనుంగవ నశ్రుపూరముల్
చిందెను, వేణి కీల్విరిసి చిమ్ముకొనె న్నటిఁజిమ్మచీఁకటుల్,
డిందెఁ దనుప్రభల్, సతి కడింది విచారముచెంద నత్తఱిన్. 131

మ. కని, యయ్యింతివిచార హేతు వెఱుఁగం గాంక్షించి నేఁజేరఁగా
జన, నక్కన్య దురంతదుఃఖభర సంజాతాశ్రు పూరంబు ల
ల్లనఁ బైకొంగున నద్దికొంచు నను సంలక్షించి కాంబోలు ని
ట్లనె వాత్సల్య రసాతిరేక వచన వ్యాసక్తి పెంపారఁగన్. 132

కం. కనులార నిన్ను గాంచిన
మనమునఁ బెనఁగొనిన దుఃఖ మాలిన్య మ్మె
ల్లను దొలఁగె; నీకటాక్షం
బునఁ దాపసవంద్య! యొక యపూర్వత దోఁచెన్. 133

ఉ. సాధుజనావతంస! నిముసంబిట నిల్చి, భవద్వచస్సుధా
మాధురి నాపయిం జిలికి మామక జన్మ సమార్జిత వ్యథా
వ్యాధి చికిత్సచేసి చనుమా! విను మావెత మాన్ప నిన్ను మా
మాధవుఁ డంపెనా? తెలుపుమా! యనుమానముమాని యోమునీ!

వ. అని విన్నవింప నేనును. 135

ఉ. ఎవ్వరిదానవమ్మ సతి! యెయ్యది నీ శుభనామమంబ! వీ
రెవ్వరు వృద్ధు లిర్వురు చరింతురు నీదగు సన్నిధానమం?
దెవ్వరు నీకు సేవలొనరించెడి యీతరుణీలలామ లీ
వివ్విధి బాష్పము ల్దొఱఁగ నేడ్చెద వేమి! వచింపు మేలగున్.

వ. అనిన భక్తికాంత యిట్లనియె. 137

క. ఈ నిర్భాగ్యవధూ కథ
పూని విన ననుగ్రహమ్ముఽ పొడమిన యేనిన్
మౌనీ! వినిపింతును, డెం
దానన్ మఱి శాంతి నూనుఽదానన్ దానన్. 138

—♦ భక్తికాంత తన వృత్తాంతముఁ దెల్పుట ♦—

తే. గీ. భక్తియన నేఁబ్రసిద్ధ నైఽవరలుచుందు
జ్ఞాన వైరాగ్య నామకుల్ ఽ సూను లరయ,
కాల యోగంబునన్ వీ రఽకాలవృద్ధ
భావ మొందిరి నే నడిఽవయసుదాన. 139

మ. అదెగంగానది,యామెయేయమున,యాఽర్యా!సింధు వాయమ్మ,యా
య్యది గోదావరి, కృష్ణవేణి యదిగో, ఽ యావంక కావేరి య
న్నది, యింకెందఱొ దేవతాంగనలు చెంఽతన్ నిల్చి సేవింతు రి
ట్లుదితప్రేమరసప్రకర్షమున నాఽకుత్సాహమున్ గూర్పఁగన్. 140

చ. యతివర! ము న్ననన్యవిభఽవాంచితనై యమల ప్రమోద సం
గతనయి వేల్పుఁబెద్దల నఽకల్మష గౌరవమొంది, నేఁటికి
ట్లతులిత దుఃఖభాజనమఽనైతిని నగ్గనినంత సాధు స
న్నుత మతివౌట నీమది కఽనూన విచారము దోఁచెనేమొకా. 141

మ. జననంబందితి ద్రావిడమ్మున మునీఽశా! మున్ను గర్ణాటకం
బున కే నేగితి సొంపుపెంపొదవె నాఽభూమిన్, మహారాష్ట్రమం
దున నెట్లో యుసురుల్ భరించితిఁగటా!ఽతో తెంచి యీఘూర్జర
మ్మున జీర్ణాకృతిఁగంటి, నిక్కలియుగంఽబున్ డాసె నీనాఁటికిన్. 142

క. ఘోరకలిం బాపండులు
సేరి మదీయాంగకములఁ జెండాడఁ దను
శ్రీ రసహీనం బయ్యెఁ, గు
మారులతో సొంపుఁ బెంపు మాసిపడియుంటిన్. 143.

ఉ. బృందకు నేగ సందుఁ గను విందగు చందము యౌవనంబు చెం
దం, దనువున్ శిరీషసుమశన స్నమమున్ సుమనోమనోజ్ఞమా
నందమునొందెఁ, గాని మునినాయక! నందను లోక్కరీతి నా
క్రందనముం బొనర్తురు జరావశులై కృశులై హతాశులై 144.

ఉ. ముప్వ్వర మొక్కలై యడుగు మోపితి మెచ్చటనైన, నిందు నే
జవ్వనినైతి, వార్ధక పిశాచము వీడదు ముద్దుకూనలన్,
నవ్వదె వైపరీత్యముఁ గనన్ విన లోక, మి దెట్టు లోర్తు నే
నివ్విధి నెవ్విధిం గడతు, నెవ్వరితో వగతోప్రివ తెల్పుదున్. 145.

సీ. ముదురు వెన్నెలచిన్నె లదరు గడ్డముల చా
యల నక్కి దోబూచులాడియాడి
తూలి చెంపల మూఁగి వ్రేలు కెంజడలూని
తూఁగుటుయ్యెలలుగా నూఁగి యూఁగి
నెనుడాసి కనుమూసి వెఱవాసి చని యోగ
విదుల గిల్గింతలు వెట్టి పెట్టి
కలకలమని బ్రహ్మ కళలొల్కు తపసి మి
న్నంటఁగని కిలకిల నవ్వి నవ్వి

ఆ. వె. సాంఖ్య విదులతోడి ఽ సంగాతములఁగూడి
బ్రహ్మవిదులతోడ ఽ బంతిగుడిచి
ముక్తికాంతతోడ ఽ మురిపెంబుగా మాట
లాడుకొనిరి యాట ఽ లాడుకొనిరి. 146

వ. ఇట్లు. 147

ఉ. నెట్టన నొక్కటై శ్రుతుల ఽ నెక్కొన నయ్యెడు మూలమూలలం
దట్టై పదంబులన్ నిలిపి, ఽ హాయిగ బ్రహ్మరసానుభూతులం
గుట్టు నెఱింగి, సాధుజనకోటుల మానసమానసంబు పె
న్ఘట్టములన్ విహారరచనా ఘటనాపరిణద్ధమూర్తులై. 148

క. చన, మును జూచిన యాలో
చనమున నీ గతిని జూచి ఽ నడినడు చాలో
చనమున మునిఁగితిని వివే
చనము నయ మ్మెఱుఁగఁ దెల్పు ఽ సన్మునివంద్యా! 149

వ. అని ప్రార్థించిన. 150

ఉ. జ్ఞానసమాధినిష్ఠఁగొని ఽ సర్వమెఱింగి వచింతు, దుఃఖముల్
మానును, మానుమమ్మ యనుమానమటంచును మాధవాంఘ్రి సే
వానియతిం గడించిన ప్రభావము భావము పారమంటి య
మ్మానిని కిట్టు లంటిని గ్రమస్ఫురితంబగు యోగసంపదన్. 151

ఉ. ఘోరం బిక్కలికాల మిందలి జనుల్ ƒ క్రూరుల్, దురాచార వి
స్ఫారుల్, మూర్ఖులఘాసురప్రతినిధుల్ ƒ బాలా! తపోయోగని
ష్ఠారాహిత్యమె తోఁచు నెయ్యెడ, సదాచారంబు దూరంబునై
తోరంబౌ వెత సాధులందును నసాధువ్రాత ముప్పొంగఁగన్. 152

తే. గీ. చెడుఁగు లోనరించి, లోకము ƒ గడబిడలకు
నడుగు దడఁబడకింత యాగడము విడక
గడనమెయి నిల్వఁబడువాఁడు ƒ గట్టివాఁడు
పండితుఁడు వాఁడు బుద్ధిమంతుండు వాఁడు. 153

క. పుడమి గనఁ దాఁక నన్నువై
యడరదు; బరువునను బడగలదవదలై వీ
డ్వడఁ బన్నగనాథుఁడు గడు
వడి నేటేటం జలించు ƒ వరలవు శుభముల్. 154

క. బృందావనమిది ధన్యము
సుందరి! నీనటన; నిందు ƒ సొంపెనయంగన్
బొందితివి యౌవనం బా
నందమునన్ నందనందన కృపామహిమన్. 155

ఉ. నీదుకుమారులన్ మఱియు ƒ నిన్నును లాలనసేయు పుణ్యులిం
దేదరిఁ దోఁపకుండుట సుధీమిా! జర వీరిని వీడదయ్యె, నా
త్మోదిత సౌఖ్యలేశమున ƒ నూనిన నిద్రఁజరింతు, రంతియే
కాదె విచార మేల మఱి ƒ గల్గదు ప్రాణభయంబు వీరికిన్. 156

వ. అనిన భక్తికాంత యిట్లనియె, మున్ను కలివచ్చు సమయమునఁ
బరీక్షితుండుగదా ధరిత్రీ రక్షణము సేయుచుండె నాతఁడు; 157

మ. కలిదోషంబు లెఱుంగఁడో, యెఱిఁగినంగాని మ్ముఁ డీఁ డేమి పో
కల వర్తించునొ మూతుఁగాక నెనొ, యాగములు విచారింప కి
క్కలనన్ నీడయొసంగెనే కలి; కొసంగెంబో ధరాసీమరం
జిలు సారమ్ము హరించెనే! కలి, హరింగెఁ జెక శౌరి సైరించెనే! 158

ఉ. ఇంచుక నిల్చిపల్కుము మునీ! మనమందలిసందియంబుఁ దూ
లించుచుఁ ద్వద్వచోఽమృత విలీనత నాత్మ సుఖించుననన్న, వి
న్పించెదనమ్మ! ప్రేమమెయి నించుము వీనులఁ, గశ్మలంబు వా
రించు సుదుక్తి వార మురకరీకృత సత్యపథం బదెట్లనన్. 159

క. ధర విడిచి స్వర్గమున కా
హరి వేంచేసిన దినంబునందే కలియు
ర్వరఁ గల్గు సర్వముక్త్యుప
కరణావళి రూపుమాపగా పాదమిడెన్. 160

వ. ఆ సమయమున, 161

మ. ఇలపై ధర్మము నాల్గుపాదములతో నింపార, నాచార ని
ష్ఠలఁ దప్పింపక సాధ్వసాధుజన రక్షాశిక్షణోద్యోగ ని
శ్చలతం బాండవ పౌత్రుఁడేలు నఖిలాశావాసితామోద ని
స్తుల ధర్మప్రథమాన సద్గుణసుమస్తోమామరక్ష్మాజమై. 162

చ. కలి చొఱఁబాఱు వేళను, జగజ్జనమాన్య నయప్రభావ సం
కలితుఁ డతండు దిగ్విజయ కౌతుక యాత్రల నున్నవాఁడు; అ
వ్వలనఁ గలిన్ దురాత్మునకు నవారిత కోపదవాగ్ని రేగి క
న్నులబడి నిప్పుకల్ గురియునో యనఁజూచి యుదగ్రమూర్తియై.

ఆ. వె. వింట బాణ మెత్తె విహ్వలుండయి, కలి
ఘర్మజలము గ్రమ్మ కంప మొంది,
దాసుఁడనని మ్రొక్కె; ధర్మవర్తనులకు
లోకువగును గాదె లోకమెందు. 164

వ. అట్లు మ్రొక్కిన; 165

ఉ. ఎక్కడ సార మింత లభియించిన నొచ్చియు నొచ్చకుండ వీఁ
డక్కట! తేనెటీఁగ సుమమందలి తేనియఁద్రావునట్లు దా
నుక్కునఁద్రావు, నైననది యొక్కపరితాపమె, వీని నేల నే
నుక్కడగింతునంచు దయనూని ప్రభుండు మఱల్చె బాణమున్.

ఆ. వె. సారవత్పదార్థ సారంబు దొంగిలు
దుస్స్వభావ మెంత దొడ్డదైన
శౌరిగాథవిన్నఁ జదివినంత నసంత
ఫలమునిమ్ము దాన బ్రతికిపొమ్ము. 167

వ. అని కలిని శాసించి విడిచిపుచ్చె. 168

మ. కలిలోనన్ దపముల్ సమాధులును యోగంబుల్ ఫలావాప్తికిన్
నిలువంజాలవు, తత్ఫలం బఖిలమున్ శ్రీనాథ గాథాసుధా
కలనన్ గూర్పఁగలాఁడు వీఁడనుచు లోకంబెల్లఁ జాటించి, య
క్కలికిన్ మేదిని నిల్వనీడ నొసఁగెన్ గాంభీర్య సంయుక్తుఁడై.

తే. గీ. అదిమొదలు ధర్మసూత్రముల్ వదలి జనులు
కాని కర్మంబులం జొరఁగాఁ బదార్థ
మెంత గాలింప నేమి యదేమొ వట్టి
యూఁక దంపయ్యె సార మింతో దవదయ్యె. 170

తే. గీ. తృణమొ కణమొ గడింపఁ బ్రాంగణములందు
నింట నింటను మూర్ఖుల వెంట వెంట
నీశ్వర చరిత్రముల వచియింతు ద్విజులు
దాన సత్కథ సార మస్తంగతంబు 171

శా. కామక్రోధ మదాది ఘోర రిపుషట్క వ్యాకులీభూత చే
తోమాలిన్యము వాయకుండనె దురాత్ముల్ యోగసిద్ధాంత ని
ష్ఠామార్గంబుల దుమ్ము గొట్టెదరు; ఆచాయం దప స్సారమే
లా! మేలౌరుచి గూర్చుఁదెల్పఁగద వమ్మా! భక్తికాంతామణీ!

మ. మనముల్ నిల్వక మోహలోభ మదదంభ వ్యాప్తిఁ బాషండ ధ
ర్మనిదాఘంబుల నింకిపోయి రుచి, శాస్త్రజ్ఞానవైముఖ్య మొం
దెనుబో మానవసంఘ మవ్వలన డిందెన్ ధ్యానయోగాది సా
ధన సంపత్తి, ఫలానుభూతిగల యాత్మజ్ఞానియే లేఁడుగా. 173

ఉ. పండితులన్న పేరున నపాత్రులుకొందరు కాలభీతి లే
కుండగ దున్నపోతు లటు లూరక క్షేత్రము లందు సంతతిన్
దండిగఁ గాంచ దక్షులు నదక్షులు మోక్షకథన్, మఱెందునే
నుండవు సంప్రదాయ సముయోచిత వైష్ణవ ధర్మవాసనల్. 174

చ. ఇది యుగధర్మమింతియ; మఱెవ్వరి నేమనఁజెల్లు? నా రమా
వదన సరోజభృంగ మిటు వ్రాలదు, వ్రాల్చదు వాలుఁజూపు; లం
టది సరిపోల ద్రాక్ష యన నంచితయుక్తి వచించె భక్తి, మ
న్మృదు వచనంబులన్ శుభమనీష వహించి రసాంచితంబుగన్.

చ. సురముని! నీవు ధన్యుఁడవు సొంపుగ నాకథ నీకుఁగాక యిం
కొరుల కెఱుంగవచ్చునె; మదూర్జిత పుణ్యవిశేష సంగతిన్
దొరకెను నీదు దర్శనము, దొడ్డలు వింటిని సర్వ సిద్ధులం
దిరపడఁజేయు సాధుజనతీర్థ సమాగమ మింత యొప్పునే. 176

మాలిని. సులభగతిని నీవో సూతకులాలించు మాత్రిన్
దొలుత గెలిచెఁ బ్రహ్లాదుండు మాయన్; ధ్రువుండున్
నిలిచె ధ్రువపదశ్రీ నీకృపన్; నిన్ భజింతున్
లలిత కుశలపాత్రున్ బ్రహ్మపుత్రున్ బవిత్రున్. 177

వ. ఇట్లు భక్తికాంత తనను వినుతించుటలు నారదుఁడు సనకాదులతోఁ దెలిపెనని సూతుండు శౌనకాది మహర్షుల కెఱింగించిన నమ్మును లవ్వలి కథావృత్తంబుఁ దెలుపుఁడని యడుగుటయు. 178

శాలిని. శ్రీ కోదండోద్దామ రేఖా మనోజ్ఞా!
రాకాచంద్ర శ్రీ విరాజచ్ఛుభాస్యా!
లోకాధారా! సర్వలోకైక వీరా!
సాకేతాధ్యక్షా! ద్విషత్పక్ష శిక్షా. 179

మయూరసారి. భానువంశసోమ! భద్రధామా!
జ్ఞాన విద్వరేణ్యా! సాధుగణ్యా!
దీన లోక రక్ష! దివ్య వీక్షా!
మాని చిత్త రంగ మంజులాంగా! 180

మాలిని. దశరథ నృపబాలా! ధర్మ సంత్రాణశీలా!
కుశికతనయదత్తాకుంఠితాస్త్ర ప్రవృత్తా!
శశివదన మనోజ్ఞా! సాధురక్షా ప్రతిజ్ఞా!
విశదతర సుకీర్తీ! విశ్రుతానందమూర్తీ! 181

గద్య. ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్షవీక్షా సమాసాదిత
కవితాంచిత శ్రీ వెంకట సుబ్రహ్మణ్యదీక్షిత ప్రణీతంబైన
భాగవత మాహాత్మ్య మను ప్రబంధమునం

—: ప్రథమాశ్వాసము :—

——

శ్రీ

# భాగవతమాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము



రఘువర ! కరుణాకర !
సారసదళనయన ! భక్తజనమోహన ! శృం
గార రససదన ! మదనా
కార ! రమాహృదయవిమలకమలవిహారా ! 1

వ. అవధరింపుము; సూతుండు శౌనకాది మహర్షుల కిట్లనియె; నట్లు
భక్తికాంత వినుతింప నారదుఁ డాదరమున. 2

ఉ. కౌరవకశ్మలంబణఁచి కాచెను ద్రౌపది, గోపకామినీ
వారము నేలె, నట్టిహరి ప్రాపయి నిన్ గరుణింప కేమగున్?
ధీగతనొందుమమ్మ ! వెతదీరకపోదిఁకఁ గృష్ణపాదపం
కేరుహముల్ మదిన్నిలిపి కీర్తనసేయుము తత్ప్రబంధముల్. 3

సీ. జగములం దమమెల్ల సడలు నీకెమ్మోవిఁ
జిఱునవ్వు వెన్నెల చిలుకుమమ్మ !
తాపసంచయమెల్ల తలఁగుఁగన్నియ నీదు
పలుకులం దమృతంబు నొలుకుమమ్మ !

ఘనసువాసనలు జాలొల్కఁగాను, నీదు వేనలిఁ
కుసుమ శృంగారంబు గూర్పుమమ్మ
పూర్ణేందుకళ నించు పోలఁతి నీమోముపైఁ
దిలకంబు తీర్చి దిద్దుమమ్మ !

తే. గీ. కలఁత విడి నీవు కడగంటఁ గాంచునంత
భువనముల శాంతిసంపదల్ పొదలునమ్మ !
హరికృపాయుక్తి కల్యాణ మడరునమ్మ !
తల్లడిలకమ్మ ! భక్తికాంతాలలామ ! 4

తే. గీ. కమలనయనుఁడు నిన్ను బ్రాణములకంటె
మిన్నగాఁజూచి నీ కనుసన్న మెలఁగు
నీవు పిలచినఁజాలు నే నెలవునందు
నైన నిలుచును శుభముల నలవరించు. 5

మ. వరలెన్ ముక్తికి సాధనంబులయి మున్ వైరాగ్యమున్ జ్ఞానమున్,
ధరపైఁ గేవలభక్తి గూర్చు కలిలోనన్ బ్రహ్మసాయుజ్య, మం
చరయం జూచియె కృషవల్లభను నిన్నాత్మానురూపంబుగన్
బరమానందచిదేకమూర్తి యగు నాబ్రహ్మంబు సృష్టించెఁగా. 6

వ. అట్లు సృష్టింపఁబడి యీవు. 7

ఉ. ఆయెడఁ గృష్ణుఁజూచి, వినయమ్మునఁ గేలుమొగిడ్చి, పద్మప
త్త్రాయతనేత్ర ! నాదువిధి నానతియుమ్మని కోరునంత నా
న్యాయముతోడ భక్తపరిపాలన సేయుము, ముక్తి దాసిగా
నీయెడఁ గూర్తు నిన్ను భజియింతురు జ్ఞానవిరాగు లన్ సుతుల్. 8

చ. అని హరిపల్కె, నీవు నవునంటివి, మాధవుఁడున్ బ్రసన్నుఁ డ
య్యెను; మఱి స్వస్వరూపమున నెల్లర నేలి వికుంఠమందు, మే
దిని నిటు నీడరూపమునఁ దీర్చెద విప్పని; ముక్తి దాసియున్
దసయులు తోడుగా ఘనముదంబును గంటివి మున్ యుగత్రయిన్.

మ. కలిలో నాస్తికబాధఁ జిక్కికొని దుఃఖంబంది యాముక్తి యీ
వల నీయానతిఁ జేసి చేరుకొనియెన్ వైకుంఠమున్, రాకపో
కలుసేయుఁ మఱియిప్డు నీతలఁపునన్; గళ్యాణి ! ఈ నీకుమా
రులు నీ పజ్జనె డాగియుందురు కలిద్రోహాభిఘాతవ్యథన్. 10

ఆ. వె. పుడమిఁ దమ్ముఁ జూచు పుణ్యుఁ డొక్కఁడు లేమి
జనులు నగుచు ముసలిబడుగు లగుచు
పడఁతి ! నీదు కొడుకు లడరెద; రిట్లైన
చింతవడకు తెఱ వాకింత గలుగు. 11

క. మానిని ! కలియుగ మిది యస
మానము, సులభమ్ము ముక్తిమార్గము దీనన్;
మానిసి మానిసి కొలువ స
దా నిన్నింటింట నిల్పెదన్ శశివదనా ! 12

క. వేడుక లొనరించెద నీ
వాఁడను మఱి వేఱు ధర్మవాంఛలఁ గొన; నీ
తోడనుమీ, హరిదాసుఁడు
గాఁడనుమీ, మాట కొక్కగడి దాటినచో. 13

ఉ. ఇమ్మహిఁ బాపులైన నరు । లిమ్ముగ నీ కరుణాకటాక్ష సం
గమ్మునఁ బాపముల్ విడి సుఖమ్ముగడింతురు; చరింతురు విష్ణుసౌ
ధమ్మున; నేరి నెమ్మది ముదమ్మున నిల్చునో నీదుమూర్తి, స్వ
ప్నమ్మున నేని వారి నయనమ్ములఁ దాకఁడు నమ్ము కాలుఁడున్. 14

క. భూత ప్రేత పిశాచ
వ్రాతము రక్షోఽసురాదివర్గము భక్తి
ద్యోతిత శుభమానసుల న
హో! తాఁకన్ వెఱచి పఱచు । యుక్తు లిఁకేలా? 15

మ. తపముల్ సేసిరె, జ్ఞానముంగనిరె? వేదప్రోక్త కర్మప్రచా
రపరత్వం బది యింతయేనిఁ గలదే, । రాజీవనేత్రున్ రమా
ధిపుఁ జేపట్టిరి గోపకన్యకలు భక్తిం జేసి, యేకాంతభ
క్తిపరీతాత్ములుఁగాక, యాతని విభూతిం గాంచఁగానేర్తురే. 16

ఉ. ఒక్కటిగాదు రెండనకు । మూరక జన్మసహస్రముల్ చనన్
నెక్కొను గొంత నీయెడల । నిక్కపుఁ బ్రేమ, మఱెందుఁ గల్గు నా
చక్కని చిద్విలాసయుతి । శౌరి నటించు శుభంబు నించు నీ
విక్కలిలోన నిట్టు లెలరయింతు మహామహిమానుభావముల్. 17

తే. గీ. భక్తికిన్ ద్రోహ మొనరించి । పరమసుఖము
గాంచఁగారాదు మూఁడులోకములనేని,
మున్ను దుర్వాసముని యెన్ని । బన్నములను
గుడువలేదమ్మ! నీకు దుండుడుకు సేసి. 18

శా. చాలున్ దీర్థములున్ వ్రతంబులు తపశ్శ్చర్యావిధుల్ యోగముల్
చాలున్ గేవలకర్మతంత్రగహనాచారప్రచారంబు చా
ల్చాలున్ జ్ఞానకథావినోదరచనాచాతుర్యముల్ భక్తి కాం
తాలాలిత్యమె ముక్తికాంత ననుసంధానించు నశ్రాంతమున్. 19

వ. అని. 20

ఉ. ఏను వచించు నిమ్మహిమ మెల్లను దా విని పుష్టి నొంది య
మ్మానిని పల్కె ధన్యుఁడవు మామకతాపము వాపినావు; నా
పై నెనరింత యొప్పునె, సెబాసిఁక నీమదినిల్తుఁగాక నా
కూనల నిద్రలేపు మునికుంజర ! నావుడు నేను నయ్యెడన్. 21

## నారదుఁడు జ్ఞానవైరాగ్యములను మేల్కొలుపుట.

తే. గీ. క్రమ్ము ముదిమిని మూసిన కన్ను విడక
మొదల కున్న కుమారులఁ గదిసి, హరిక
థామృతము వీనుతీవల నలవరించు
మృదుల కరపల్లవమ్మునన్ మేను నిమిరి. 22

తే. గీ. శ్రుతుల నోంకృతి శ్రుతుల సన్నుతు లొనర్చి,
గీతకృతి పాడి స్వరయోగరీతి విడక,
శ్రుతుల మూలలఁ జేరి విశ్రుతనినాద
చతురతరయుక్తిఁ జప్పట్లు చఱచి చఱచి. 23

క. యోగులకు జోగు మాన్పి వి
యోగుల జోగులను జేయు నూర్జితగుణ సం
యోగులు బ్రహ్మపదశ్రీ
భాగులు వే లెండు లెండు! భక్తికుమారుల్! 24

క. లేరా! జ్ఞానా! లేలే
లేరా! వైరాగ్య! నిద్ర లేరా! వే రా
వేరా! జ్ఞానా! వైరా
గ్యా! రారా! మోక్షపథవిహారా! యనుచున్. 25

మ. హరిబోధామృత మాధురీకలిత మాద్యద్ధర్మ సంగ్రామరం
గ రసావేశ మనోజ్ఞముల్ విజయ శంఖధ్వానముల్ వీనులన్
జొర నిద్రాలసభావమెల్ల విడునంచున్ నించితిన్ సద్రసో
త్తర వీణాశ్రుతిచాతురీఘటిత గీతాగాన మర్యాదలన్. 26

వ. మఱియు. 27

మ. ఘనయోగానుగతానుభూతి మహిమన్ గల్యాణి కాంభోజి మో
హన హంసధ్వనులన్ విముక్తగళుఁడై యాలాపముల్ సేసి, జి
ల్గునఁ బల్కించితి వీణపైఁ గళలు జాలొల్కఁ, నవ్యయూనంద సా
ధన సద్యఃకవితానిబంధనములన్ దత్త్వప్రబంధంబులన్. 28

వ. అంతట నా భక్తికుమారులు. 29

చ. ఎగయక తెప్పలెంత మొగయించిన, నాఁకలిఁ జిక్కి, మత్తునన్
జిగి విడి, యెండు కట్టెలటు చేడ్పడి, మై తల పండిపోయి, తె
ల్లఁగ ముదికొంగలట్టుల నలంగుచు దొర్లుచు నావులించి మె
ల్లఁగ నొకమాఱు లేచి మరలన్ నిదురంబడి తూలిపోయినన్. 30

చ. కనుఁగొని వారి దుర్విధిని, గ్రమ్మిన శంక నిఁకేమి సేయ నా
ననుకొని, నిద్రవాయ దకటా! మఱి వార్ధకభూతమెట్లువీ
రిని విడు దైవమా! హరి హరీ! యని మాధవపాదసంస్మృతిన్
గొని వివశుండనై బడలి కొంతవడిఁ గను మోడ్చునంతలో

సీ. కళవళింపకు యోగితిలక! నీ జతనంబు
జతపడు నింక సంశయము లేదు;
సాధువుల్ సాధుపూజాపరుల్ దెలిపిన
సాధనంబును నీవు జరుపుమయ్య!
యుడుగు వీరల నిద్రయును జరావృత్తియు
భక్తియున్ హర్షసంపద గడించి
సర్వవర్ణంబుల సౌఖ్యమ్ము లలరించు
నిది యీశ్వరాదేశ మెఱుఁగుమయ్య
తే. గీ. యనుచు విస్పష్టముగఁ బల్కె నచటి మునులు
వినఁగ, నేనును విని కడు వింత గనఁగ,
నుదితసాధుజనామోద మృదులవాక్య
కలనఁ గలకలమనుచు నాకాశవాణి. 32

తే. గీ. కడురహస్యార్థముగఁబల్కె ƒ గగనవాణి
సాధనంబేమొ ! అది తెల్పు ƒ సాధు లెవరొ !
యెందు లభియింతురో యెట్టు ƒ లెఱుకపడునొ?
ఇపుడు నా చేయఁదగు కార్య ƒ మెద్దియొక్కొ ! 33

మ. అనుచున్ వారల నచ్చటన్ నిలిపి యేనంతంతఁ దీర్థాల వెం
టను దారిన్ జడదారులం గనుచుఁ బ్రశ్నల్ సేయ వృత్తాంతమం
తను నాలించెద రంతె కాని యిదమిత్థమ్మంచు లక్షించి, నా
యనుమానంబెడలన్ వచింపఁగల పుణ్యాత్ముండు లేఁడొక్కఁడున్.

సీ. మీఁదను బనియున్న ƒ దీదారి నేవత్తు
తడ వాగుమని తెల్పి ƒ దాటెనొకఁడు,
అదియట్లనా? మీకు ƒ నటు వినంగానయ్యె
నా? మహాత్ములటంచు ƒ నరిగెనొకఁడు,
ఆలోచనాసాధ్యమైన యంశంబిది
పొమ్మనె గంభీరముగ నొకండు,
ఇందు మీ రెఱుఁగని ƒ దేమి మేమా మీకు
బోధించుటని జారిపోయె నొకఁడు,
ఆ. వె. అవును గాదు నాక ƒ యాలోచనము సేయ
మిన్ను జూచె నొకఁడు ƒ మన్ను జూచె;
అడలుచుం బరారులై రెల్ల మును లాత్మ
తరతమపరిబోధ ƒ నిరతిఁ జాటి. 35

చ. గగనసరస్వతీవదనగహ్వరనిస్సృతవాక్ప్రవాహ మ
ల్లెగసిన, సంశయంపుసుడి నిట్టటులై భువనంబులెల్ల విం
తగతి విచారసాగరమునన్ బడి కొట్టుకపోయె, దారి నా
కగపడదయ్యె నయ్యెడ నహా! మఱిదయ్యె మెఱుంగునాగతిన్. 36

శా. హాహాకారము పెల్లురేఁగె, సుకృతాహంకారములీఁగె, సం
దేహాందోళితభావవీచికలయందే యూఁగి రాత్మజ్ఞులున్;
మోహాంబంది తపించె సర్వభువనంబుల్, దేవమౌనీంద్రున
య్యూహామార్గముదాఁటెనే విషయమోహా! యంచుసాగె నుడుల్.

వ. అట్లు నాకథ, 38

ఉ. ఆ చెవి నాచెవింబడియె; నక్కట! దీన నుపాయమేమియున్
దోఁచక నారదుండటులఁ దూలుచు నుండ, మనుష్యమాత్రులా
దోఁచినఁ బల్కువారనుచుఁ దోఁచియుఁ దోఁచని మాటలాడుకొం
చేచిన శంకనే చని రెల్లకు వచ్చినదారి సాధువుల్. 39

వ. అప్పుడు నేను, 40

చ. అలయికమై విషణ్ణమతినై యటు నే బదరీవనాంత భూ
ములఁ దప మాచరింతునని పోవునెడన్ రవికోటికాంతిసం
కలితుల సాధుపుంగవులఁ గాంచితి భాగ్యగతిన్ దపోధురీ
ణుల సనకాదులన్ మిము; మనోవ్యథ కొంతయడంగె నింతటన్.

వ. ఇది మదీయ చరిత్రం బింతవడి జరిగినదెల్లఁ దెల్ల మొనర్చితి నిఁక
మీఁద మీరె ప్రమాణమని వెండియు నారదుఁ డిట్లనియె. 42

మ. కనుగొంటిన్ మిము బుద్ధిమంతులను యోగశ్రేష్ఠులన్ నందనం
దన సంకీర్తన తత్కథారస సుధా ధారాసమాధీన జీ
వనులన్ మామకభూరిభాగ్యము ఫలింపం బోలు నీనాఁట; న
న్ననుకంపారస శీతలాంతర దృగంతాసక్తి లాలింపరే. 43

క. హరినామస్మృతితత్పరు
లరు మిమ్ము కాలకృత కళంకం బెప్పుడున్
బొరయదు; పంచాబ్దవయ
స్స్ఫురణన్ బొలిచెదరు పూర్వపూర్వజులయ్యా. 44

క. మీకనుబొమ ముడివడ హరి
లోకద్వారాధినేతలుంబడి రిలపై,
మీకృప గల్గిన యంతనఁ
జేకొని రున్నతపదంబు చిత్రముకాదే! 45

ఆ. వె. గగన వాణి మాట గతిఁ దోఁచు సాధనం
బేమి? దానినడుపు టెట్లు? భక్తి
సుతులతోడ నెట్లు సుఖములందఁగనేర్చు?
నెల్ల వర్ణములు తరింతురెట్లు? 46

క. అనవిని హరిదాసజనా
గ్రణి! యోగ ధ్యమణి! ఘన విరక్తజనశిరో
మణి! నారద! ధన్యుఁడవీ
వని సనకాదులు నుతించి యనిరిబ్భంగిన్. 47

ఉ. కొందల మంద నేల మునికుంజర! డెందముఁదార్పుమవ్యయా
నందము; సాధనంబది వినంబడు నింతకుమున్న; లోకమం
దందర భక్తి నూల్కొలుపు టయ్యది శ్రీహరిభక్తుఁడౌట నీ
యందొక వింత గూర్పదు నిరంతరసాధుహితానువర్తనా! 48

ఉ. లోకములో మునిప్రవరులున్ బ్రకటించిరి దారులెన్నో, య
వ్యాకులతం జరింపనవి స్వర్గఫలంబిడు; మోక్షలక్ష్యమున్
జేకొన నొప్పు గోప్యమగు నిస్తులమార్గము; దానిఁ జూపువా
రేకడనో లభించెద రహీన తపఃఫలభాగ్య సంగతిన్. 49

ఆ. వె. కర్మ ముత్తమంబు గావింపుమని తెల్పు
గగన వాణి మాట గతి యెఱింగి
యిదె వచింతుమేము చెదరని మదిఁ దార్చి
వినఁగదయ్య శుభము గనఁగదయ్య! 50

——♦ సనకాదులు నారదుని సంశయములు వారించుట. ♦——

కం. యాగవితతి, ద్రవ్యతపో
యోగ స్వాధ్యాయబోధ యుక్తిని క్షితిపై
సాగును గర్మవిధాయక
మై; గణ్యం బిందు జ్ఞానయజ్ఞం బొకఁడే! 51

క. శ్రీమద్భాగవత శుభక
థామధురాలాపములు సుధారసమొలుకం
గా మును శుకముఖ గీతము
లై మహిమన్ మించె జ్ఞానయజ్ఞంబది యా. 52

శా. భక్తింగూడి కుమారు లాశ్రితవిధిన్ బాటించినన్ భవ్యమౌ
శక్తింగాంచెద; రిద్ధరన్వీడు జరా సంతాపముల్, సౌఖ్యముల్
భక్తింబొందును, సింహగర్జనము పర్వంబాఱు తోడేళ్ళల
ట్లుక్తమ్మౌ కలికాలకశ్మలము వాయుం దత్కథాధోరణిన్. 53

తే. గీ. జ్ఞానవైరాగ్యలంగూడి సరభసముగఁ
బ్రేమరసయుక్తి నెల్లర వెంటవెంట
నింట నింటను భక్తి చరింపఁగలుగు
ననిన సనకాది మునులతో ననియె మహాని. 54

తే. గీ. వేదవేదాంత ఘోషముల్ వినిచినాఁడ
లలితగతి గీతసదివి మేల్కొలిపినాఁడ
నొక్కఁడేని ప్రబోధంబు నొందఁడయ్యె
కడకు విసివితిఁ బ్రాణము ల్గడలఁబట్టె. 55

ఉ. భాగవతంబు వృత్తములఁ బంక్తిని బంక్తిని బల్కుపల్కునం
దాగమసారమే వెలయు నంటిరి; యే వినిపింపలేదె య
య్యాగమ జాలమెల్ల! నదియంతయు నిష్ఫలమయ్యె; వెండియున్
భాగవతంబె వించుమని పల్కెద రేమికతంబు తెల్పుఁడీ! 56

చ. కనవినరాని సంశయ వికారములన్ భవదీయ వాగ్రసా
యనమున మాన్పనెంచి, శరణాగతరక్షకు లీరటంచునున్
గని యిటు సాహసంబు నొడిఁగట్టి, వితర్కముసేసినాఁడ నన్
గనికర మూని కావుఁ డెదఁగల్గిన సంశయముల్ దొలంగఁగన్. 57

వ. అనిన విని సనకాదులమ్మౌని కిట్లనిరి; 58

క. వేదోపనిషత్సారం
బాదట భాగవతమయ్యె నైనను వేత్తె
వేదాదులకున్ మీరిన
స్వాదుఫలం బిచ్చు భాగవతము మునీంద్రా ! 59

సీ. తరుల నామూలంబు విరిసిన సార మె
ల్లను ఫలంబుల నానఁజనెడునట్లు
క్షీరంబులఁ నేయి వేరై హవిస్సుల
సురలకు రసవృష్టి గురియునట్లు
ఇక్షుగర్భంబునం దెనసియు మించి చ
క్కెరయందె చవి చాలఁ బరఁగునట్లు
సుమములందలి మరందము తేనెపెఱయందుఁ
జిందువాఱుచు విందు సేయునటులు
తే. గీ. వేద వేదాంతములనెల్ల వెలసియున్న
సారమదియంత యొకటిగాఁ జేరి, వెలు
భాగవత సత్కథారూప భవ్యఫలము
మించు రుచి మించుననన్న శంకించు టేల ? 60

తే. గీ. ఆత్మవిజ్ఞాన దీక్షితుండైనయట్టి
వ్యాసుఁ డంతటివాఁడు విభ్రాంతిపడఁగ,
కలఁత విడ నీవు నాల్గు శ్లోకముల భాగ
వత పురాణార్థ సిద్ధాంత తతి నొడివితి. 61

ఉ. అయ్యెడ బాదరాయణు హృదంతర తాపము వాపినట్టి నీ
కియ్యెడ విస్మయం బొదవు టేటికొ? పైమముఁ బృచ్ఛసేయు టే
మయ్యా! యశేష దుఃఖ పరిహారక మాధవ పుణ్యలీలలన్
దియ్యము గూర్చు భాగవత దివ్యపురాణము విన్నఁ జాలదే. 62

వ. అనిన విని సురముని యమ్మునివరుల నిట్లని వినుతించె. 63

మత్తకోకిల.
ఘోర సంసృతి దావ వహ్నిని గూలి మ్రందెడువారి కె
వ్వారి దర్శన భాగ్య సంగతి భద్రముల్ సమకూరు; న
వ్వారి మి మ్మహిరాజకీర్తిత వారిజాక్ష కథా సుధా
సార తోషణులన్ గృపారుచి జాల్కానన్ శరణొందెదన్. 64

మ. బహుజన్మార్జిత భాగధేయ గరిమన్ బ్రాపించు మిత్రుండు, న
న్నహ మజ్ఞాన తమో వికారపటలీ పాటచ్చరుండై; మన
స్స్పృహణీయంబు వివేక కాంతి యచటన్ జెల్వారు నద్దాన భీ
రహితంబైన పదంబుఁ జేరఁగల రాహర్యశ్రేణి నిక్కంబుగన్. 65

వ. ఇట్లు నారదుఁడు వినుతించెనని సూతుఁడు శౌనకాదులకుం
దెల్పిన ననంతర కథావిధానం బానతీయవే యని వారలడుగు
టయు. 66

శా. శ్రీ సీతాస్మితచంద్రికామృత సరోరేఖాగ్ర శృంగార హే
లా సోపాన పరంపరా విహృతి లీలారాజహంసాకృతీ!
కౌసల్యావ్రత సార సంభృత లసత్కల్యాణమూర్తీ! శుభా
వాపీభూత మునీంద్ర సుందరమనః పంకేరుహేందిందిరా! 67

మంజుభాషిణి. అవనీసుతాప్త! పవనాత్మజార్చితా!
ప్రవిసీల నీరద విభావిభాసితా!
భవనీరధి ప్రచుర భంగ భంజనా!
నవనీత సన్నిభ మనస్సరోరుహా! 68

కవిరాజ విరాజితము.

అమల మునీంద్ర హృదబ్జ విహార స
మాదర! సారదయాశరధీ!
సముదిత శౌర్య విశాల! దిశాచల
సంగత సాంద్రయశఃపరిధీ!
కమల నిభానన! గాధితనూజ మ
ఖ ప్రతిపాలన కార్యరతీ!

ప్రముదితభక్తపరాయణ! సత్కవి
రాజవిరాజిత సరమ్యకృతీ! 69

గద్య. ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్షవీక్షా సమాసాదిత
కవితాకలాంచిత శ్రీ వెంకట సుబ్రహ్మణ్యదీక్షిత ప్రణీతంబైన
భాగవత మాహాత్మ్య మను ప్రబంధమునఁ
ద్వితీయాశ్వాసము

శ్రీ

# భాగవత మాహాత్మ్యము

శ్రీ

## మూడవ యాశ్వాసము





జానకీ ముఖాబ్జ
భ్రాజత్కస్తూరికా కఁరంబిత కరుణో
త్తేజి దృగంచల వీక్షా
రాజీ! రాజద్గుణాకఁరా! రఘువీరా! 1

వ. అవధరింపుము; సూతుండు శౌనకాదులతో నిట్లనియె నట్లు నారదమహర్షి సనకాది మునికుమారులవలన భాగవత మహిమంబు విని; 2

తే. గీ. జ్ఞానయజ్ఞం బొనర్తు మీఁరయాన శుకక
థా సుధా మాధురీ సముఁదార ఫణితి
పూని; యీ భక్తి వైరాగ్య ఁ బోధములకు
నవని శాశ్వత సంస్థాన ఁ మమరుఁగోఱకు. 3

క. ఆయాగ మెందు జరుపుదు?
నేయది తన్మహిమ? మదియు ఁ నెన్ని దినంబుల్
సేయం దగు క్రతు? వయ్యది
యీయెడ వేదజ్ఞు లీరఁలెఱింగింపుఁ డనన్. 4

వ. వినయ వివేక లక్షణ లక్షితుండ వగుట నీ కది వినిపింతు మని
యమ్మునులి ట్లని తెలుపం దొడంగి ర దెట్టు లనిన; 5

క. నానాసురర్షి సిద్ధ
స్థానంబై, వివిధ తరు లతా సంతానం
బై, నవకోమల వాలుక
మై, నూతన హేమపంకజామోదంబై. 6

క. ఆనందవనం బనఁగా
నానందద మగుచు నలరు నమరనదీ ద్వా
రానన్ గుప్తంబై; పగ
మాని యఖిలజీవకోటి మను నట శాంతిన్. 7

వ. అచట; 8

ఉ. నందకుమార సారతరనవ్య కథా మధుర ప్రసంగ మా
నందము గూర్ప జ్ఞానసవనంబున దీక్ష వహింపు మానిరా
డ్బృందము తోడుగాఁగఁ; గనువిందగు నందముయాావనంబు నొం
దం దగురీతి భక్తియును నందనులుం దనియం గలా రటన్. 9

తే. గీ. భాగవత సత్కథావార్త పరఁగు నెచట
నచట భక్తి నటించు నవ్యాజరక్తి
శ్రీశుక కథాక్షరం బింత చెవిని బడినఁ
జెలఁగి యిమ్మువ్వురకుఁ గొంత్రచేవవచ్చు. 10

వ. అని పలికి; 11

—: సనకాదులు సప్తాహ మొనర్చుట :—

చ. సనకసనందనాదిమునిసంతతి నారదుఁ గూడి నందనం
దనచరితామృతాప్తికయి తత్పరతన్ సురవాహినీతటం
బున కరుదెంచి రంతటన మూఁడుజగమ్ములనున్ బ్రమోదసం
జనిత జయస్వనంబొలసె జాల్కొనె మంగళ తూర్యనాదముల్. 12

తే. గీ. భాగవత సత్కథాసుధా పాననిరతు
లైన శ్రీవిష్ణుభక్తు లత్యాదరమునఁ
బరువులిడి క్రమ్మి రానందపరత యజ్ఞ
వాట మెల్లను దొలుత నార్భాట మెసఁగ. 13

తే. గీ. భృగువసిష్ఠ విశ్వామిత్ర పిప్పలాద
పరశురామ పరాశర వ్యాసగౌత
మాత్రిజ మృకండుతనయ మేధాతిథులును
జహ్ను శాకల జాజలి చ్యవన ముఖులు. 14

క. దేవలుఁడు దేవరాతుఁడు
నావల ఛాయాశుకాదు లరుదెంచిరి భ
క్త్యావేశమునం దమ శి
ష్యావళితో సుతులతోడ నాత్మసతులతోన్. 15

తే. గీ. వేద వేదాంత మంత్ర తంత్రాదికమ్ము
లాగమ పురాణ కథలు గంగాది నదులు
పుష్కరాది సరస్సులు పుణ్యభూము
లురువనము లద్రి దిశలు రూపొందివచ్చె. 16

తే. గీ. నాగలోకంబు దేవ గంధర్వ కిన్న
రులు నరుగు దెంచి క్రమ్మ రెవ్వాలననేని
భారమున రాని వారి సంభావనమ్ము
జరిపి రప్పించె భృగుఁ డాత్మశక్తివలన. 17

వ. అంతట, 18

తే. గీ. యజ్ఞదీక్షితులై సనకాదిమునులు
నారదుం డిడు భద్రాసనమునుండి
జన వినతు లందుకొని, కొని ఘనసమాధి
నీరజాక్షు పద ధ్యాన నిరతులైన. 19

తే. గీ. వైష్ణవ విరక్త సంయమి బ్రహ్మచారి
వరులు ముం; దగ్రపదమున సురమునియును
దేవతలు వేదశాస్త్రముల్ తీర్థములును
గదిసి రింతట నంతటఁ గాంత లొకట. 20

తే. గీ. శాంతరసికాయ తే నమ స్సర్వకామ
దాయ కృష్ణాయ మోక్షసంధాయకాయ
దళిత భవ బంధనాయ కందళితభక్తి
భావ గమ్యాయ సౌమ్యాయ భద్రదాయ. 21

తే. గీ. నిర్వికల్పాయ కల్పాంత నిర్విశేష
శేష తల్పాగ్ర శయనాయ శ్రీధరాయ
సకలకల్యాణ నిలయాయ సన్నుతాయ
దివ్యలీలావతారాయ తే నమోఽస్తు. 22

తే. గీ. అమలమునిరంజనాయ నిరంజనాయ
అఖిల భయభంజనాయ తమోఽంజనాయ
అంజనాపుత్రసేవ్యాయ కంజలోచ
నాయ తుభ్యం నమోఽస్తు నారాయణాయ. 23

తే. గీ. సచ్చిదానంద! గోవింద! జయముకుంద!
జయ కృపాకందళితమతే! సాధుబృంద
వందనీయపదాబ్జ! సంక్రందనాది
సకల బృందారకస్తుతిచయవినోద! 24

తే. గీ. వేదవిజ్ఞేయ! సర్వసంవిద్విధేయ!
జయ విజయసారథే! జయ సరసగేయ!
జయ జయ మహాప్రతాప! దుర్జయ! దురాప!
జయ జయ తమఃప్రదీప! చిన్మయకలాప! 25

మత్తేభ గర్భసీసము.

సు (విలసన్నీరద శోభితాంగక! జగ
ద్విఖ్యాత శౌర్యోన్నతీ!) జోహారు

ప్రి (చలదిందీవర పత్రలోచన! యశ
శ్చంద్రాశ్రితపాంచద్దిశా!) జోహారు

వి (దళిత ప్రత్యర్థివీర విక్రమ! కృపా
ధౌరేయ భావాంచితా!) జోహారు
స (లలిత శ్రీ శుక సంభృతాద్భుత కథా
లావణ్య సారాకరా!) జోహారు
తే. గీ. శ్రీమనశ్చారుకుముదశశీ ! జోహారు
సాధుమానసరాజహంసా ! జోహారు
నవ్యవనమాలికాభరణా ! జోహారు
దేవకీలబ్ధ పుణ్యాకృతీ ! జోహారు. 26

తే. గీ. అని నమోవాకములు జయధ్వనము లొలసె
శంఖదుందుభి నిర్ఘోష సమితి మొరసె
చూర్ణ లాజంబులున్ సుప్రసూన వితతి
రాసులై నిండె నయ్యజ్ఞ రంగమందు. 27

ఉ. క్రిందుగఁ గూడి కల్ప సుమరాసుల నించుచు వచ్చిరంత నా
నందము మీర జ్ఞాన సవనంబును జూచి తరింపఁగోరి సం
క్రందన ముఖ్యులౌ సురలకల్మషభక్తి విమానయానులై;
యందఱు నేకచిత్తులయినంత మునీంద్రులు పల్కి రివ్విధిన్. 28

—♦ సనకాదులు భాగవత ప్రభావము నారదునకుఁ దెల్పుట ♦—

ఉ. అంబుజసూతి ముద్దుకొడుకా! వినుమయ్య శుకాగమప్రభా
వం; బెది యొక్కమారు చెవిఁబట్టినఁ జాలరచేత ముక్తి ని
క్కంబగు; నక్కథాశ్రుతి సుఖంబునఁ దేలిన భక్తుచిత్తప
ద్మంబున నంబుజాక్షుఁడు ముదంబొనగూర్చుచుఁ దాండవించెడిన్.

తే. గీ. శుకుని వచనామృతము చెవిసోకు వఱకు
నెంతయేడ్చిన నేని దేహికి దురంత
జనన మరణాది ఘోర సంసార చక్ర
మునఁ బరిభ్రమణంబు తప్పనిదె సుమ్ము. 30

తే. గీ. శ్రుతులు వల, దేల శాస్త్రసంతతులగోల ?
భ్రమకు మూలములౌ పురాణము లవేల ?
భాగవతకృతి ముక్తి సంపద ఘటింతు
నంచు నన్నింటిమించి గర్జించుచుండ. 31

తే. గీ. శుకుని వచనామృతము చెవి సోకునంత
వఱకు దేహికిఁ బాపసంబంధముండు;
నెచట భాగవతము పఠియింతు రా గృ
హంబు తీర్థంబు పావన మఘహరంబు. 32

ఉ. భాగవతంబు నర్థ పరిపాటిఁ బఠించిన జన్మకోటులన్
మూఁగిన పాపముల్ విడు, నపూర్వమహాధ్వర పుణ్యలబ్ధియున్
గాఁగల దందు శ్లోకమొ, సగం బొ, సగంబుసగంబొ, పాడినన్
వీఁగు నశేష మోక్షపదవీగమన ప్రతిబంధ తంత్రముల్. 33

తే. గీ. మరణవేళను శుక కథాక్షరము విన్నఁ
జాలు వైకుంఠ మందిచ్చు శౌరిమెచ్చు
కనకసింహాసనమున భాగవతముంచి
భక్తిన కొసంగ సాయుజ్య పదవి దొరకు. 34

మ. జననం బందినదాది శ్రీ శుక కథాసారామృతం బింతగ్రో
లని జన్మం బది గార్దభశ్వపచ తుల్యం బట్టి నీచాత్ముఁడౌ
మనుజుం డుండియు లేనివాఁడనఁదగున్ బాపాత్ముఁ డవ్వాఁడు నే
దినికిన్ దల్లికి భారభూతుఁడనుచున్ నిందింతు రీ దేవాళియున్.

చం. తపముల నేదిరాదు, మఱియెక్కడు యోగములన్ సమాధులన్
జపముల నే ఫలం బొదవఁజాలద దంతయు నశ్రమంబుగా
నుపగత మాను సప్త దివసోజ్జ్వల పుణ్యకథానియుక్తి చే
నిపుడపుడంచు హద్దు లిడనేల వినుండిది యెల్ల వేళలన్. 36

వ. ఆయువల్పంబగుటయు రోగాదులవలనిభయంబధికం బగుటయుఁ
గారణంబుగా, 37

తే. గీ. మానసిక వృత్తి నిలువమి, మంచి నియమ
ఫక్కి నడువమి, దీక్షయుంబట్టువడమి,
కలియుగమువారు సప్తాహ కల్పమునను
దీని వినుఁడంచు శుకుని యాదేశ ఫణితి. 38

తే. గీ. శ్రద్ధమెయి నెవ్వ మాఘమాసమున విన్న
నేఫలం బిచ్చు శుకకథ; యా ఫలంబు
నెల్ల సప్తాహయజ్ఞమం దేర్పరించెఁ
గరుణ శుకమౌని కలికాలకలుషమడఁగ. 39

ఉ. ఎప్పుడొ కోటిపుట్టువుల నేర్పడు పుణ్యవిశేషసంగతిం
దప్ప లభింప దీశుకకథానక, మట్లోక వేళ నబ్బినా
యిప్పుడు నప్పుడంచనక నెల్లపుడున్ వినఁజెల్లు; సత్యమున్
దప్పక బ్రహ్మచర్య విధి దాటక సప్తదినాధ్వరంబులన్. 40

చ. తపముల నేదిరాదు మఱియదక్కదు యోగములన్, సమాధిచే
జపముల నేఫలం బొదవఁ జాల, దదెల్లయు నశ్రమంబుగా
నుపగతమాను సప్తదివసోజ్జ్వల పుణ్యకథాప్రసక్తిచే;
నపరిమితంబు తన్మహిమయంతయు నేము నుతింపనేర్తుమే. 41

చ. వ్రతములకంటె యోగపథ వర్తనకంటెఁ దపంబుకంటెనున్
గ్రతువులకంటె ధ్యానముల కంటె వివేకముకంటె యాగసం
గతవిధికంటెఁ దీర్థములకంటెను గర్జనముం బొనర్చు న
చ్యుత చరితాధ్వరం బఖిల సూరిజనస్తవనీయపుణ్యమై. 42

క. గర్జించున్ గర్జించు స
మూర్జిత గతి సప్తదిన కథోదితమహిమం
బార్జవమున ఘనగర్జా
స్ఫూర్జన్మహిమంబ దెల్లఁ బొగడవశంబే? 43

క. అరరే! యేమని తెల్పుదు
మరవిందదళాక్షువరకథాధ్వరదీక్షా
స్ఫురదురుగర్జారవ మఘ
హార మభయద మనుపమాన మానందదమున్. 44

వ. అనిన విని శౌనకుఁడు; 45

క. నిశ్శ్రేయ శ్శ్రేణికి మో
క్షశ్రీకి నిదానమైన కథయిది ము, న్నే
యాశ్రయమునుండి పుట్టెనో
యశ్రమమునఁ దెలుపవలతు నని యడుగుటయున్. 46

వ. సూతుఁ డతని కిట్లనియె. 47

చ. హరి ధరణీభరం బుడిపి యాత్మపదంబున కేగు వేళఁ ద
చ్చరణజని యుద్ధవుండనియె శ్రీపతికంజలిసేసి, "మాధవా!
యరుగుచునుంటివీవు కలి యల్లదె పైకొనుచుండె సాధులున్
దురితనియుక్తి క్రూరులయితోఁచెద రిక్కలికాల సంగతిన్. 48

వ. మఱియు, 49

శా. గోరూపంబుననున్న మేదిని వడంకకున్ బర్వుచే, దిక్కునున్
లేరెవ్వారిట భక్తవత్సల! దయన్ నిల్వంగదో యీ నిరా
కారుండున్ మఱి చిన్మయుండవయి భక్తశ్రేణిఁ బాలింప సా
కారుండున్ సగుణుండవై తివికదా ! కంజాక్ష! లక్ష్మీపతీ! 50

క. నీవారు నిలువఁజాలరు,
నీవేగిన నిర్గుణైక నియమార్చనలన్
భావంబుసారదు, భక్తుల
కావంతయె సుఖము గలుగ దరయుము కృష్ణా! 51

చ. అన విని యుద్ధవానుమతి నంబుజలోచనుఁ డాశ్రిత ప్రజా
వన విధికై ప్రభాసమున భాగవతాంబుధి నాత్మ తేజముల్
బనుపడఁజేసె; నట్లు హరి మంగళరూపమె వాఙ్మయాకృతిన్
దనరెను; విన్ననన్ జదివినన్ గనినన్ దురితంబడంచుచున్

మ. జగతిన్ ముక్తివిధాయిసాధనములన్ సప్తాహ మత్యుత్తమం
బగుఁ; గామాద్యరివర్గముల్ గెలువ నోనద్దాన, దారిద్ర్యముల్
వగపుం బాప మభాగ్యముం దొలఁగు, దానంగాక శక్యం బదె
ల్లగు వేల్పుల్ దరియింపలేని హరిమాయన్ దాటిపోనిక్కలిన్

మ. అని యమ్మౌనివరుల్ నగాహ మహిమం బారీతి విన్పింప, నం
దనులున్ యౌవనమొంది తన్ గదియ, నానందంబునన్ బద్మలో
చన! గోవింద! ముకుంద! కృష్ణ! నృహరే! శౌరే!మురారే!హరే!
యనుచున్ భక్తియు చెంగునన్ దరిసెనొయ్యారంబుగాఁదత్సభన్

ఉ. అంతటఁ బ్రేమమూర్తియు సమంచితసుందరవేషయున్ రమా
కాంత కథార్థభూషిణియుఁగా, నరుదెంచిన భక్తిఁజూచి యే
చెంతనునుండివచ్చె? నెటుచేరె మునీంద్రసభాంగణంబు ని
య్యింతియటంచునన్ బలికి రెల్లసదస్యులు సమ్ముదమ్మునన్.

వ. అంతట, 56

క. తనయులు భక్తియు నిటు సొం
పెనయుటకుఁ గథార్థమొకటి హేతువటన్నన్
విని భక్తియు ఘన వినయ
మ్మున నపుడు సనత్కుమారముని కిట్లనియెన్. .. 57

మ. కలిదోషార్కర్మ్య నిదాఘతప్తనయి యా|కంపించు నాపై భవ
ల్లలితాలాప సుధారసంబు గురియన్ | లావణ్యముంబుష్టియున్
గలిగెన్; బ్రహ్మవిదగ్రిణుల్ దెలుపుఁడిం|కన్ నేను నాబిడ్డలున్
జలుపంగా దగు కార్యమెయ్యది? నివా|సంబేదియో మాకిలన్.

వ. అనిన నమ్మునికుమారు లిట్లనిరి. 59

మ. హరి సారూప్యమొసంగి భక్తులకుఁ బ్రే|మైకామృతావాప్తి దు
ర్భర సంసారరుజల్ హరించుచును ధై|ర్యంబూని, యానందసుం
దర రూపంబున విష్ణుభక్త జనహృ|త్పద్మాలయాస్థానివై
పరిపాలింపగదమ్మ లోకముల నం|బా! భక్తికన్యామణీ! 60

వ. అట్టి సమయమునందు; 61

తే. గీ. ఇలను గలి పాపమే, రాజ్య | మేలు నైనఁ
గడక నీవంకఁ గన్నెత్తి | కాంచ వెఱచు
ననిన విని, భక్తి హరిదాస | జనమనోఽబ్జ
రంగముల నెలకొనెఁ బ్రేమ | చెంగలింప. 62

చ. ధనము లవేల శ్రీహరి క|థారసభావిత భక్తియోగ సా
ధనధన మేరికిం గలుగు | ధన్యులు, వారె ధనాఢ్యు లబ్జలో
చనుఁడు స్వలోకము న్విడిచి | సత్వర మేగి తదీయచిత్తమం
డనమగు భక్తిసూత్ర పరి|ణద్ధ మనోహర చిత్ప్రకాశియై. 63

మ. ఇది బ్రహ్మాత్మకమైన భాగవత మింకే దేసర్వధర్మమ్ములున్
బదిలం బైనవి, సర్వకర్మఫలముల్ ప్రాపించు నర్థంబుతోఁ
జదువన్ విన్న నరుండు మాధవునితో సారూప్యముం బొందుని
య్యదిగా కన్యములైన ధర్మము లవేలా ముక్తి సాధింపగన్. 64

వ. అని సూతుండు శౌనకాదులకుఁ దెల్పిన వారు నాపైఁ గథా
విధానం బానతీయవే యనుటయు; 65

క. రామా ! రఘుకుల జలనిధి
సోమా ! కలికలుషహారి సుకవినుతకథా
స్తోమా ! ప్రేమామృతహిమ
ధామా ! శృంగారసీమ ! తారకనామా ! 66

మ. సదానందరసాశుపూరతరళ ప్రస్విన్న నేత్రామర
ప్రవరోద్గీత దశాస్యశిక్షణకళా చాతుర్య గాథా స్తుతి
శ్రవణోద్వేల్ల దమంద రాగ రచనాంచచ్ఛ్రీకటాక్షోదయ
చ్ఛవినీరాజిత సుస్మితాననసరోజా ! రామచంద్రప్రభూ ! 67

గద్య. ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్షవీక్షా సమాసాదిత
కవితాకలాంచిత శ్రీ వెంకట సుబ్రహ్మణ్యదీక్షిత ప్రణీతంబైన
భాగవత మాహాత్మ్య మను ప్రబంధమునఁ

—: దృతీయాశ్వాసము :—

శ్రీ

# భాగవత మాహాత్మ్యము

## చతుర్థాశ్వాసము



కర కరకమల! కవిక
లాకలితాద్భుత యశోవిలాస! సుహాసా!
సాకేతాధిప! రిపుజన
భీకర వరఖడ్గబంధవిహితోల్లాసా! 1

వ. అవధరింపుము; సూతుండు శౌనకాది మహామునుల కిట్లనియె; నట్లు సనకాది మునికుమారులు భాగవత మహిమంబు వినిపించు సమయంబున, 2

తే. గీ. విష్ణుదాసుల మనసులు విమలభక్తి
రసపరిష్కార మొందిన రహినెఱింగి,
భక్తవత్సలుఁడౌ భగవానుఁ డాత్మ
లోకమందుండి వచ్చి యాలోనఁదోఁచె. 3

వ. అంత, 4

సీ. కౌస్తుభవనమాలి$కాసమంచితవక్షు
నంబుదశ్యాముఁ బీ$తాంబరధరుఁ
గాంచీకలాపసం$కలితు నూర్జితవేషు
మకరకుండలు రత్న$మయకిరీటు
స్మరకోటిలావణ్య$ధరుఁ ద్రిభంగీకృత
సుందరాకారు రా$కేందువదను
మురళీధరు వినూత్న $ హారిచందనాంచితు
సచ్చిదానంద భా$స్వత్స్వరూపుఁ
తే. గీ. గనిరి భక్తులు తమ మనః$కమలములను;
స్వర్గవాసులు నుద్ధవ $ ప్రభృతు లక్క-
థాశ్రుతిసమాదృతిఁ వచ్చి $ దాగిరచట
జయజయనినాద మలమె దిక్$చక్రమెల్ల. 5

వ. అప్పుడు నారదుఁడు సనకాదులం గని, 6

ఉ. దేహము గేహముం బ్రియస$తీసుతమిత్రసమాజసంగత
స్నేహము,విస్మరించి యిటు $ నీరజనాభకథారసైక స
మ్మోహితులౌచు సభ్యజన$ముల్ పశుపక్షులు మూర్ఖులుం గలి
వ్యూహముదాటి రిక్కథకుఁ$ బోలికయున్నదె చిత్తశోధనన్. 7

శా. తోరంబౌకృప, మీరలిక్కలికృత $ ద్రోహానలజ్వాల చ
ల్లారంజేయ సమున్నతిన్ నిలిచి స$ప్తాహోధ్వరశ్రీకథా
ధారావృష్టిని బైపయిం గురిసి రా$ర్తత్రాణపారీణు! లె
వ్వారెవ్వారు విశుద్ధులైరిదివిన $ వారిం బ్రశంసింపుఁడీ! 8

వ. అని యడిగిన నమ్మునికుమారు లిట్లనిరి. 9

తే. గీ. ఘోరపాపస్వభావులాచారదూరు
లనృతవాదులు పరిబలక్రోధాగ్నిదగ్ధు
లమితకాముకు లతికుటిలాత్ము లైనఁ
గలిఁదరింతురు హరికథా కర్తునియుక్తి. 10

తే. గీ. పతితు లాశ్రమ ధర్మ వివర్జితులును
దంభమాత్సర్య హింసా విధాయిమతులు
గురుజన ద్రోహులుం గడు క్రూరులైన
గలిఁదరింతురు హరికథా కర్తునియుక్తి. 11

తే. గీ. త్రికరణంబుల మలిన వృత్తిం జరించి,
మాయలంగూడి, పరవధూ మాన్యధన స
మూహములఁ గొల్లగొనునట్టి మూర్ఖులైనఁ
గలిఁదరింతురు హరికథా కర్తు నియుక్తి. 12

వ. వెండియు వినుం డియ్యర్థంబున దురితాపనోదన సాధనంబైన యితిహాసంబుగల దదెట్టులనిన; 13

## ఆత్మదేవుఁడను బ్రాహ్మణుని చరిత్రము.

చ. కల దఁట తుంగభద్రనదిగట్టునఁ బట్టణ రాజ మొక్కఁడ
వ్వలనున నాల్గువర్ణములు స్వస్వకులోచిత ధర్మబద్ధులై
యలరుచు నుందు రెం దనృతమన్న దెఱుంగక; యప్పురంబునన్
గలఁడొకఁ డాత్మదేవుఁడనఁగాఁ దగి విప్రవరుండు విశ్రుతిన్. 14

శా. శ్రౌతస్మార్తములన్ సమగ్రుఁడు, శ్రుతి ప్రావీణ్యసంపత్తిలో
నేతన్మాత్రుఁడు గాఁడు, భానుసముఁడై యింపారు, నవ్వీట భి
క్షాతంత్రంబునఁ గాలముం గడుపుచున్ సంపన్నుఁడై యుండి, వి
ద్యాతీర్థుం డతఁడార్యలోకహిత వృత్తం బత్యుదాత్తంబుగన్. 15

వ. ఆ భూసురునకు దుంధులి యను భార్యగల దది. 16

సీ. కొలము గల్గిన దందములకుఁ దావల మింటి
పని చక్కఁబెట్టు నేర్పునను జాణ
మన సొకప్పుడును మెత్తన గాను, నీచురాల్
మగనిమాటకు మఱు మాట వెదకు
తనయన్నమాట నెట్టన నిల్పుకొనఁ జూచు
కయ్యంబునకు మున్న కాలుదువ్వు
నూరి గాథలకు వీనొగ్గు క్రూరత్వంబు
వదరుబోతుతనంబు పట్టువిడదు

తే. గీ. ఇట్టి సతిఁగూడి ప్రేమ దానెరపుకొనుచు
మను నతఁడు; వారి కర్థ కామములనింటఁ
బాడి పంటల భోగ్యసంపదల నింత
గూరదు సుఖంబు సంతతి కొఱతవడుట. 17

తే. గీ. గుడులముఖమండపంబులన్ గూర్కవెట్టి,
కనఁబడిన రాతికిన్ మ్రొక్కి, కతలెఱింగి
మొఱఁగి యశ్వత్థముల చుట్టుఁ దిఱిగి తిఱిగి,
ధర్మములు సేసి రెన్నో సంతానకాంక్ష. 18

క. శకునముల నడిగి, సాము
ద్రికములకుం జేతులిచ్చి * తీరని వెత నూ
రక వెచ్చించిరి విత్తం;
బోక మార్గమె వెఱ్ఱియాస * కూరటయున్నే? 19

క. ఆవుల గోవుల బంగరు
ప్రోవుల వలువలను దానశ్రములఁ బేదలకీ
నీవుల సగమయ్యెన్ సిరి;
యావల సగమయ్యె మేను * నయ్యె విధులన్. 20

వ. ఇట్లెంత సేసిన సంతతి గలుగమికి వగచి యా బ్రాహ్మణుఁడు, 21

చ. అడవుల సంచరించుచు, నొకప్పుడు వేసవి మండుటెండలన్
బడుగయి దప్పితీర్చికొని * వారిలెఁ దటాకమునొద్దనందు; న
ప్పుడుయతియొక్కఁడెయ్యెడకొపోవుచుడాసియెవండవొక్కొయీ
కడ నిటు లారటంపడెదు * కారణమేమని పల్కరించినన్. 22

వ. విప్రుఁ డయ్యతికి సవినయంబుగ వందనమాచరించి, 23

మ. మునునేఁ జేసిన పాపకర్మ మిది; నా * పూర్వుల్ దివిన్ గోరు వె
చ్చని యశ్రూదకమాని నిల్వలసెన్; * ఋష్మదేవులున్ దేవులున్
గొనరే నేమిడినన్; విషాదగతి నాకుం బ్రాణముల్ వోకయు
వ్వని కేతెంచితి సంతులేని సిరులన్ * వాంఛామదం బారినన్. 24

ఉ. సంతతిలేని జీవితము సంతతిలేని గృహంబు సంపదల్
సంతతిలేని వంగడము సంతత నింద్యము లందు; రయ్యొ దే
వింతయొ నేను ధేనువును బెంపఁగ నద్దియు గొడ్డువోయె; నా
యంతన నాటినట్టి తరువా ఫలియింప దదెన్ని యేండ్లకున్. 25

మ. ఫలమందుం మఱిడిందు, చిత్రమగు నిర్భాగ్యంబపో గొడ్డుబో
తులజన్మం బొక జన్మమే యని కడుం దుఃఖింపఁ దత్కాలమం
దలివార్లుం యతి యోగదృష్టిఁగని, సంతానంబు నీకేల ని
చ్చలు సంసారము ద్రెంచి మోక్షపదముం సాధింపు సన్న్యాసివై.

మ. సగరుం డంగుఁడు నాదిగాఁగల నృపుల్ సంతానముం బొంది, పొం
దగలేరైరి సుఖంబు; సంసృతి దురంతం బంతమే లేని క
ర్మగతిం జిక్కులపాలుగాకుము, పరిజ్ఞానాగంపు రోగంబు చ
ల్లగ ఖండింపు వివేక మౌషధముగా లక్షించి భూమీసురా! 27

వ. అనిన నవ్వొజ్జబాపఁడు, 28

తే. గీ. వలవను వివేక మే బిడ్డవలతుఁగాని
నాకుఁ బనలేని శుష్క సన్న్యాసమేల
పుత్ర పౌత్రయుతుండు పో పుణ్యుఁడెందు
కానినఁ బ్రాణ మిప్పుడే కడకవిడుతు. 29

మ. అని కోపించిన విప్రుఁజూచి యనె నిర్లజ్జ యోగియుం ధాతవ్రాఁ
తనుమాయించిన చిత్రకేతునకు వంశతల్ గల్గెఁ బో మున్ను నీ
కును సంతానము సప్తజన్మములకుం గూడంగబో దట్లుతై
నను నిన్నర్థిని ద్రోసిపుచ్చుటకు డెందం బొప్పదయ్యెం ద్విజా! 30

వ. అటుగావున నీకొక దివ్యఫలం బిచ్చెద; నది నీభార్య కిచ్చి భక్షింపం జేయు మద్దానఁ దనయుండు గలుగఁగలఁడు, మఱియు నిది దిని నది మొదలుగ, 31

తే. గీ. సత్యమున్ దయ దానంబు ♣ శౌచమును,
యేకభుక్తంబు గావించి ♣ యింతి యొక్క-
వత్సరమ్ము వ్రతమ్మున ♣ వంశకర్త
యైనకొడుకును గాంచు నిశ్చయ్యాది నిజంబు. 32

చ. అని యతియేగె, నంతద్విజుఁడచ్చెరువున్ముదమున్ మనంబునన్
బెనఁగొన నింటికేగి, సతిఁబిల్చి కుమారకుఁ గాంతుగాని లె
మ్మని సరసంబులాడి ఫలమామె కరంబులఁబెట్టి వెండియున్
వినిచె వ్రతంబు పూనువిధి ♣ విస్తృతరీతి యతీంద్రుమాటగన్.

వ. దుంధులి మగనిమాటలు విని. 34

కం. పిడుగడచినట్టులై, దుం
దుడుకుదనం బడరఁ, దొడరి దుఃఖాశ్రువులున్
జడిగొని పయ్యెద దడియఁగ,
కడుఁగలగెన్ పండుదిన్నఁ ♣ గడుపౌననుచున్. 35

వ. అప్పు డాత్మదేవుఁడును, 36

తే. గీ. ఔనె! యడవులపాలయి § సూనుగాంచు
ఫలముదెచ్చిన కన్నీరు § నొలికె దశుభ
మన; దెలిసి యేడ్పునకెగాని § హర్షమునకు
బాష్పములురావొయని కైత§వంబునడపె. 37

వ. కాని యేకాంతంబున, 38

చ. అనయము మాయదారిజవ§రాలది యేడ్చుచు, గుట్టుగన్ సఖీ
జనముల కిక్కటన్ దెలిపి, § చావు నిజం, బెటుపోతు గర్భమే
యనువున నా ప్రసూతిసమ§యవ్యథనోర్తును? లేనిపోని సం
తనుగొనివచ్చె నామగఁడు§తప్పదు గర్భము పండు మ్రింగినన్. 39

శా. చూలైనన్ గడుపుబ్బుతిండియుడుగున్ § శుష్కించుఁ బ్రాణంబులున్
దూలున్, నాగృహతంత్ర మాగు;బరువున్ § దోరంబుగానైన, యీ
వేళన్ దొంగలముట్టడుల్ బలిసెనా § వేవేగఁ బర్వెత్తగాఁ
జాలన్, జాలు నివేల బిడ్డలకునై § సత్యాది నిర్బంధముల్. 40

ఆ. వె. చిలుకపంజరాన § నిలిచినట్లేర్పడు
గర్భమాప్రసూతిఁ § గడపుబెట్టు
లట్టిపైన మరణ § మాసన్నమగు; నాడు
పడుచు నాదుసిరుల § నొడిచికొనును. 41

చ. విధిమగవాఁడు; వానికి వి§వేకములే; దబలాజనంబు ని
వ్విధిఁ బ్రసవార్తికిన్ గొలిపి § వేచెడుగాని, యొకప్పుడేని యీ
వ్యథ మగఁడైనవాఁడెఱుగు§నట్టులవ్రాసెనె? వ్రాసెనేని య
య్యథములు బిడ్డలంగనగ § నారడిబుత్తురె యాఁడువారలన్. 42

క. మగువలు నానాశ్రమలన్
దగిలి కుమారులను గన్నఁ దమకొడుకులటం
చెగిరిపడెద రిదియేమే?
మగపశువుల కింతయేని మానముగలదే. 43

క. మగనాలై పుట్టితి ని
వ్వగఁబొందితి; ధవునిఁబాయు వనితయు గొడ్రా
లగునది ధన్యలు మును వా
రగణితపుణ్యంబులేమి యార్జించిరొకో! 44

క. అనవిని ముక్కున వ్రేలిడి
కొని యియ్యది యేమివింతగోల? లతాంగుల్
తనయులఁ గనరే భువిలో
వినమే నీవొక్కతల్లిబిడ్డవుగావే? 45

చ. అనియటఁ బెద్దలాడిరయొ! యారడిబెట్టకుఁ డమ్మ ముద్దరా
లనిరొకకొంద; రద్భుత మహా! సుకుమార మదింత [illegible] లెం
డని పరిహాసపుం జెణుకులాడిరి ప్రౌఢ; లొకళ్లొకళ్లనుం
గనుగొని యాఁగఁజాలక పకాలున నవ్విరి ముగ్ధలెల్లరున్. 46

క. పకపకలన్ వికవికలన్
గకవికలై మనసుచాల కంగారైనన్
వెకలితనము బయలైయది
సకియల నెడబాసి యింటి చాయకుఁ జనియెన్. 47

వ. అట్లేఁగి, 48

తే. గీ. ఫలము దినకున్న మగఁడు నన్ బ్రతుకనీఁడు
తింటినా గర్భభారంబు తీవరించు
చెలులకుం దెల్ప నీపాటి చెట్టుబుట్టె
తప్ప దిఁకఁజావు; పైబాధ తడవనేల! 49

వ. అని యా పండును మ్రింగను బారసైవనుంగాక పరితపించుచుండె నంత, 50

చ. చెలియలు చూడ వచ్చిన విశేషమిదంతయుఁ దెల్ప నామె లో
నలరివచించె; గర్భవతినై తిని నేఁగని బిడ్డనిత్తు నీ
కలిమి యొకింత నాపతికిఁ గానుక వెట్టు మతండు నొప్పెడిన్
దెలియఁగ నీకు మేరకిది నిక్కపు గర్భిణినా నటింపవే. 51

ఉ. పూవులుదాకినన్ సురిగిపోయెడి నీమెయిదీవ గర్భ బా
ధావధి నోర్వఁజాల దబలా! మఱి ప్రాణములున్నఁ జాలు లె
మ్మావున కీఫలం బిడుదమద్దియుఁజూడగవచ్చు నన్న; నా
త్రోవఁ జరించె దుంధులి వధూజనవృత్తమదెంత కేఁదగున్. 52

వ. ఇదియిట్లుండ, నాత్మదేవుం డనుంగుఁ బత్నియెడ దౌహృదలక్షణంబు లెడనెడ శంకించుచుండి, 53

సీ. ఫలమారగించితే ? ఫలితమేమని యాతఁ
డన నామె వానాన ముకదశ్రిను వహించు
యతివాక్య మహిమ మత్యద్భుతతమంబని యాతఁ
డన నామె చిఱునవ్వు గనినుచుఁ బెదవి
ఏమేని మనసయ్యేనే తెల్పుమని యాతఁ
డన నామె తలవాంచి ? యట్టె జూచు
పెదవి మన్నంటి కోకన్నది చూడుమని యాతఁ
డన నామె చూపు జంకెనలఁగసరు,

తే. గీ. ఎట్టి పౌఢకుఁ బ్రథమ దాంపత్యదవిముగ్ధ
మధుర లజ్జానుభావముల్ ? మానవేమొ
యనుచు మురియును వెఱ్ఱిబాహ్మణుఁడతండు
వాని గికురించి పొంగు నత్వన్నెలాడి. 54

తే. గీ. మఱచి వడివడి నడచి యమ్మాయలాడి
మగఁడు చూచెనో యను శంకతమగుడ నుస్సు
రస్సురని మెల్ల మెల్లనడుగు వెట్టుఁ
గపట వృత్తియు నైజముఁ ? గాళ్ళఁబెనఁగ. 55

చ. కడుపునఁ బ్రాఁతచీర లొడికంబునఁ జుట్టి నెలల్ ననన్ జనన్
బడలిక సోకినట్లు పయిపాటున పాన్పునపోలివాలిలు; లో
నడలు జనించినట్లులుకు ? నారటముంబడు నెప్పుడో మగం
డడరిన వేడ్కఁ దారసిలహావ్రితభంగము తాకఁబోకనున్. 56

వ. ఇక్కరణి నా టక్కులాడి, టక్కరితనంబు మెరయ, మాయా గర్భిణీ వేషాభినయంబున నతివినయంబు చూపుచుఁ గడుమెలఁకువ గలిఁగి మెలఁగుచున్నంత. 57

తే. గీ. ఆఱునెలలకుఁ దన గర్భ । మంతరించె
ననుచు నొకమాట పుట్టించి, । యవల నేర్పు
మిగులఁ దాఁగన్న కొమరుని । మగనివలన
ననిపె మంధులిచెలియలి । య్యప్పకడకు. 58

క. అందికొని యక్కుమారుని
మందగమన పురిటియింట । మసలుచుఁ దా నా
నందనుని గంటి ననుచు న
మందానందమునఁ దెలిపె । మగనికి వార్తన్. 59

క. యతిమహిమ కతనఁ బడసితి
నతులిత మహిమానుభావు । నాత్మజు నని సం
తత గీతవాద్య వితతుల
నతఁడెన్నో జరిపె మంగళాచారములన్. 60

తే. గీ. చెల్లెలు నవప్రసూత, యాశిశువు దొఱఁగి
యేడ్చుచున్నది, యది వచ్చు । నేని బాలుఁ
బాలొసఁగి పెంపఁగలదు, నా । వలనఁ గాదు
దాని రప్పింపుఁడన పతి । దానిఁ బిలిచె; 61

వ. మఱియు నాదంపతు లా నందనునకు దుంధుకారి యని పేరిడు
కొని వినోదించుచుండి రంత; 62

క. యతిఫలము దిన్న గోవున
కతిసుందరు డమరరూపుఁ డంచితకనక
ద్యుతి కలిత దిగ్విభాగుం
డతులిత మహిమానుభావుఁ డాత్మజుఁ డొదవెన్. 63

క. అదివిని విప్రుం డద్భుత
ముదమున జననోత్సవాది పుణ్యవిధుల నొ
ప్పిదముగ జరిపెన్ మఱియొకఁ
డొదవెన్ సుతుఁడెట్టి భాగ్యమో యిది యనుచున్, 64

తే. గీ. యతి ఫలం బిచ్చు కాలమహత్త్వమేమొ?
శిశువు గలిగిన వేళా విశేష మేమొ?
భగవ దవ్యాజ కరుణా ప్రభావమేమొ?
గోవు మానవలె ముద్దుల కొడుకుఁ గనియె. 65

వ. అని;

క. గోకర్ణుఁడగుట బాలకు
గోకర్ణం డనుచుఁ బేరుకొనె ద్విజుఁ డానం
దైకనిదానంబై య
య్యాకారము చూచువారి కబ్బురమయ్యెన్. 66

క. గోవునకు మనుజబాలకుఁ
డీవరుసం గలుగుటెన్నఁ డేఁ గనినామే,
యీ విప్రభాగ్యలక్షణ
మే వారికిఁ గలుగు ననుచు నెంచిరి లోకుల్. 67

వ. అవల నబ్బాలకులు దినదిన ప్రవర్ధమానులై యౌవనం బెనసి
రందు. 68

శా. గోకర్ణుం డిలుబాసి, యోగపదవీ కూలంకష బ్రహ్మని
ష్ఠాకల్పంబులఁ, దీర్ఘయాత్రలను సంచారంబు సాగించె, నా
రా! కాసంతసుఖంబు దుఃఖమును నైరం బాప్తభావంబు రా
నీ కేకాగ్రమనస్కుఁడై మునిజనాసీకంబు జేవెట్టగన్. 69

వ. ఇఁక దుంధుకారి యనువాఁడు. 70

తే. గీ. స్నానశౌచాదికర్మ సంతానముడిగి
క్రోధియై దుష్పరిగ్రహాకులత సీచ
వృత్తి శవహస్త భోక్తయై భీతిదొలఁగి
మించువైరానఁ గొంప లంటించి బ్రతికె. 71

తే. గీ. ఆటపాటలఁగదియు నయ్యర్భకులను
నూతఁ బడద్రోయు నంధుల కూతఁజెఱచు
సాధుజనముల నంధులన్ జావమోదు
నడరి కడజాతి పొందున కంగలించు. 72

ఉ. అందఱుఁ గత్తిగట్టు నొక యాకయు నడ్డు నెఱుంగ, కింటఁ ద
ల్లిం దన తండ్రినిన్ జదిపి లేశమునున్ సిరిదక్కనీ కదె
ల్లం దరలించి జారిణుల లాలనకున్ జమసేసె; నంత యా
నందనుఁడేటికిన్ గలిగి నాడని యేడ్వఁదొడంగె విప్రుఁడున్. 73

తే. గీ. అవల నుత్తమ గతు లుండ వనుచు వెట్టి
తనమునన్ భ్రష్టుఁడైన యీతనయుఁ గంటి
నివల గతి దప్పిపోయె నికెల్లరిగి గొడ్డు
బోతునై యుండ కేనేల మోసపోతి. 74

వ. అని విచారించుచున్నంత. 75

శా. గోకర్ణుం డపు డేఁగుదెంచి జనకుంగారాడి, నిస్సారమా
రా! కాంక్షించెద వీ భవంబు మఱి భార్యాపుత్రమిత్రార్థముల్
చీకాకుం బొనరించు, స్నేహము మనశ్చింతాగ్ని నిన్ బెంచుఁబో
యేకాంతవ్రతుఁడో విరక్తునిదిగాదే సౌఖ్యమెప్పట్టునన్. 76

క. ఇందు నకు లేదు, లేదు న
రేందునకున్ సుఖమదెల్ల యేకాంతమ ని
స్తందిత వర్తిలు యోగిజ
నేందుని సొత్తనుచుఁ దెలియుమీ! నా తండ్రీ! 77

మ. అనిబోధించిన నాత్మదేవుఁ డను, బిడ్డా! ఘోరసంసార మన్
వనిలోఁ జిక్కితి, స్నేహపాశముల నిర్బంధంబుఁ ద్రెంపంగలే
కనిశంబున్ జరియింతుఁ గర్మగతులన్ హా మూర్ఖుఁడన్ గ్రుడ్డివో
యిన జన్మంబిది యుద్ధరింపు మొరు లేరీ దిక్కు నీకంటెనున్. 78

వ. అని వాపోయినఁ గని గోకర్ణుఁడిట్లనియె. 79

చ. ఎముకలు మాంసమున్ రుధిరమేర్త్తరఁగూడిన దేహమందుఁ బ్రే
మము విడు; మాలుబిడ్డల మమత్వము గోయు; క్షణంబుపాటి లో
కము నిజమంచు నెంచకు మఖండవిరాగరసానుభూతివై
భ్రమమును వీడిభక్తిపరిపాకమునన్ భజియింపు మచ్యుతున్.

ఉ. లౌకికధర్మముల్ విడు, కలంగకు కామము జాడఁ జిక్కి, రా
నీకు మనంబుచెంతకు ననిత్యములౌ గుణదోషచింతనల్;
చేకొని సాధుపుంగవుల సేవలొనర్పు, ముకుంద సత్కథా
స్తోకసుధారసాంబునిధిఁ దూఁగుము, గోరి తరింపు సంసృతిన్. 82

వ. అని తెలియ నాడిన నాత్మదేవుఁడు.

చ. అరువదియేండ్లునిండి, యపుడర్భకు చేసిన బోధపండి, దు
స్తరభవవారిధిం గడువఁదత్తరమెత్తి రమేశుభక్తిని
ర్భరమతివై భజించి, మతిభాగవతంబు పఠించి మాధవున్
దరిసి విముక్తుడయ్యె గడుఁదత్పరతన్ దశమంబు పాడుటన్. 83

వ. అని సనకాదులు దెలిపిరని సూతుండు శౌనకాది మహర్షులకుం దెల్పిన, వారవ్వలికథా వృత్తాంతం బానతీగదే యని యడుగుటయు. 84

ప్రమాణి. మనీషి లోక విస్ఫుర
న్మనస్సరోజ మందిరా!
మునీంద్ర బృంద వందితా!
వినీల దివ్య విగ్రహా! 85

మ. నవనీరేజదళాయతాక్ష! విలసన్నాళీకజాద్యర్చనో
త్సవ! వారాశిమహాగభీర! హిమవత్క్ష్మాభృన్నిభస్థైర్య! శ్రీ
ధవ! విష్ణూపమవీర్య! సూర్యసుతమిత్రత్రా! మిత్రవంశోదయా!
పవమాన ప్రియసూను పాణికమలప్రత్యర్పితాంఘ్రిద్వయా! 86

వసంతతిలక. వీరాధివీర! వనవీథి కృతాసిధారా
ధారా నిరస్త ఘనదైత్యదవాగ్నికీలా!
శ్రీరామ! భక్తజనచిత్త సరోజ లీలా
గారా! వసంత తిలకప్రియ! నిర్వికారా! 87

గద్య. ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్షవీక్షా సమాసాదిత
కవితాకలాంచిత శ్రీ వెంకట సుబ్రహ్మణ్యదీక్షిత ప్రణీతంబైన
భాగవత మాహాత్మ్య మను ప్రబంధమునం
—: జతుర్థాశ్వాసము :—



శ్రీ

# భాగవతమాహాత్మ్యము

## పంచమాశ్వాసము





హనుమదుపాశ్రితపద!
సోఽహంభావైక గమ్య! సునిశిత బాణ
వ్యూహ విదళితాసుర! సం
దేహ నివారక! శ్రుతిస్మృతి ప్రతిపాద్యా! 1

వ. అవధరింపు మంత సూతుండు శౌనకాది మహర్షుల కిట్లనియె; నట్లు దుంధుకారి యనువాఁడు. 2

తే. గీ. తండ్రి పరమపదంబందఁ దల్లి నేక
తంబ దండించి యింటిలో ధనము గొల్ల
గొట్ట నడిరేయి నదియు గగ్గోలుసేసి
నూతఁబడి ప్రాణముల్ వాసె నూతలేక. 3

వ. అంత. 4

తే. గీ. వెలవెలఁదు లైదుగురు, వింత కలికితనము
నిచ్చకము మచ్చువెట్టి యప్పచ్చెకాని
వలపుటుచ్చులఁ దవిలించి వెలగలట్టి
చీరలున్ సొమ్ములిమ్మని చిచ్చువెట్ట. 5

శా. చోరగ్రామణియై నిశల్ దిరిగి, వా|సోభూషణ శ్రేణి దు
ర్వార ప్రక్రియ ముచ్చిలించి యిడ, య|వ్వారాంగనా వార మే
దారిం దార్చిన దానదారెను మదాం|ధంబౌ పరాహాంబు న
ట్లూరన్ గ్రామ్యసుఖైక తత్పరత వాఁ|డుద్రిక్తుఁడై రిక్తుఁడై. 6

తే. గీ. వానికున్నంత; పైనటు | వచ్చినంత;
మూటముల్లెయు హరియించి | మోసకత్తె
లింక నీదొంగసొత్తుతో | నిండెయున్న
మనకునుం జావు మూఁడు ని|మ్మనుజుతోడ. 7

తే. గీ. అనుచు, నిదురించువానిఁ ద్రా|టను బిగించి,
గ్రుమ్మిచావక యున్న మొ|గమ్మునందు
నిప్పులిడి చంపి గోతిలోఁ | గప్పి యింట;
నవల విరహవ్యథా భార|మభినయించి. 8

తే. గీ. అంగజాస్త్రంబులకు మమ్ము | నప్పగించి
దూర మేఁగెను బ్రియుఁ డరు|దేరఁ డెట్టు
మనుదు మని యేడ్చి లోకుల | కనులు మొత్తి
సొత్తుతోఁ బారి రింకొక | పొత్తుగోరి. 9

చ. తెలిసినవాఁడు కాంతల మ|దిన్ మదినమ్మఁడు; నమ్మి మూర్ఖుఁడు
జ్వలతరశోకవహ్నిఁ బడి|చచ్చును; గామశిఖీంధనంబు లిం
తుల నుడు; లిక్షుఖండముల|తోఁ దులువల్ దుల సేయుచుండ్రు; ని
చ్చలు హృదయం బెఱుంగరు వి|షచ్ఛురికాగ్రసమానమంచ యో!

ఉ. చచ్చిన దుంధుకారియుఁ బిశాచపురూపున గాలిబుంగయై
వచ్చెడు బాటసారుల కపారభయం బిడు రూపు లూనుచున్,
హెచ్చగు నాఁకలిన్ జలియు నెండయు వానయు నోర్వలేక దా
నచ్చట నిచ్చటన్ బఱచె హా!యని దయ్యము నార్పువెట్టుచున్.

ఉ. అంతట దుంధుకారి హతుఁడౌట వినంబడఁ దానె దిక్కునై
యెంతయు శ్రద్ధ శ్రాద్ధ మిడియెన్ దగు తావుల ధేనుకర్ణుఁ డ
త్యంత విషాద మొంది; మఱి యాత్మగృహంబున కేగినంత; నా
చెంత నటించెఁ బ్రేతము విచిత్రతరోగ్రభయాకృతిన్ నిశన్.

వ. మఱియు వాఁడు. 13

క. ఒక తఱి మేఁకయు నేనుఁగు
నొక పరి మహిషంబు, నిందుఁ డొకపరి చిచ్చుం
దొక తఱి నరుఁడై తోఁచెన్
గకవిక లవిగాంచి ధేనుకర్ణుం డనియెన్. 14

శా. ఓరీ! యెవ్వఁడ వీ నిశీథమున నిట్లుగ్రాకృతుల్ పూని సం
చారం బేల యొనర్తు వియ్యెడ? పిశాచప్రేత రక్షస్సులం
దేరూపం బిది తెల్పరా యనిన వాఁడేడ్చెన్; మఱిన్ బల్కఁగా
నోరున్ రాదని సంజ్ఞ సేసె నవలన్ గోకర్ణుఁ డబ్రింబునన్. 15

ఉ. దోసిట నీరుచల్లిన విధూత భయంకర రూపుఁడై వెసన్
డాసియు వాఁడు! సోదరుఁడ నన్నెఱుఁగం గదె దుంధుకారిగా;
దోసము లెన్నొ చేసి కులదూరుఁడనైతి; సమస్తలోక హిం
సాసముపాత్తదుష్కృతిని జచ్చి చరింతును బ్రేతరూపినై. 16

ఉ. క్రూరుఁడ లోకహింసకుఁడఁ గూలితి జారిణులెల్లఁ గూల్చ, నీ
దారిఁ జరింతు దైవవిధి దయ్యపు రూపున; నిన్నినాళ్లు నిన్
గోరితపింతు నిన్గనుటకున్ ముదమయ్యెడు నిప్పు;డింక నే
తీరున నియ్యవస్థ గడతేఱునొ తెల్పఁగదయ్య తమ్ముఁడా! 17

వ. అనిన ధేనుకర్ణుం డిట్లనియె. 18

తే. గీ. గయను బిండము వైచితిఁ గాశికాప్రి
ముఖ మహాక్షేత్రతీర్థభూములను శ్రాద్ధ
శత మొనర్చితి; నీదుర్గతి యొకింత
కడవ దిం కేమిసేతు నీ కర్మమునకు. 19

తే. గీ. అనిన మొఱవెట్టి నీవుగా కన్య లెవ్వ
రడ్డుపడ నేరరయ్య యీ యొడ్డు గడువఁ
బెట్టుమనె వాఁడు; గోకర్ణుఁ డట్టెచూతు
నెడ గలుగఁ బొమ్ము పిల్చిన నిటకురమ్ము. 20

వ. అని వానిందోలి. 21

క. జాలింబడి యీపాపము
దోలం దగ వైన తెఱువెదో! శోఁపదటం
జాలోచించియుఁ దెలియం
జాలండయ్యెను నిశావసానంబయ్యెన్. 22

ఉ. వేకువ ధేనుకర్ణుఁడు పవిత్రుల బెద్దలఁ బిల్చి దెల్పెఁదా
నీకథ యేమిదారి యనియెన్ మఱి; మౌనులు బ్రహ్మవాదులౌ
గాకని ధర్మశాస్త్రముల కట్టడులం గని ముక్తిహేతువ
న్నాకనరాదు; సూర్యవచనంబుఁ బ్రమాణముగా గడింపుమా! 23

వ. అని విన్నవించి రంత, యోగనిష్ఠాగరిష్ఠుం డగుట. 24

శా. గోకర్ణుం డినువేగ మాపి "తరణీ! కొల్తున్ జగత్సాక్షి న
స్తోకాజ్ఞానతమోవిభంజను బుధస్తుత్యున్ గృపాసింధువున్,
లోకాలోకచరిష్ణు వేదమయునిన్ రూపింపు మీ ప్రేత మె
ట్లీకర్మం బెడబాయుఁ? బుణ్యగరిమం బేరీతి నార్జించు? నాన్.

తే. గీ. చండకిరణుండు కరుణ రేయొండగాసి
గాసి చెందకు గోకర్ణ! కమలనాభు
నద్భుతకథానకంబు సప్తాహయుక్తి
వినుచు మీ ప్రేతజన్మమున్ వీడు వీఁడు. 26

చ. అనె రవి; సూర్యసూక్త మదియౌ నని రందఱు, నంత నిశ్చయం
బొనరిచి ధేనుకర్ణుఁ డది యుఁన్ జరిపింపఁగఁబూనె, సాధువుల్
చని, రమరుల్ వెఱంగువడ సాగిరి తన్మహిమానుభూతికిన్
నఁ జని రెల్ల దోషములు వీడగ వృద్ధులు మందు లంధులున్. 27

## —♦ గోకర్ణుఁడు సప్తాహము గావించుట ♦—

మ. అట్లు ధేనుశ్రవసుండు నగ్రపదమందు దాసీనుఁడై యిక్కతన్
స్ఫుటరీతిన్ వినిపింపఁ, బ్రేతమటకున్ రాజొత్తెంచి చూపాన్చి, య
చ్చోట నెత్తంబడి సప్తపర్వయుతమై సొంపారు నవ్వేణువం
దెటో వాతాకృతిపూని నిల్చి వినెఁ దా నీపుణ్యగాథాతతిన్. 28

తే. గీ. ధేనుకర్ణుండు విష్ణుభక్తి ప్రశస్తు
నొక్క ద్విజముఖ్యు శ్రోతగా నునిచి మొదటి
స్కంధమును దొరఁకొని సమగ్ర కథ వచింప
ప్రథమదివసాన వేణుపర్వంబు విడియె. 29

క. సప్తదినంబులు జరుగన్
సప్తగ్రంథులును విడె సశబ్దంబుగ సం
ప్రాప్తించె దివ్యమూర్తి స
మాప్తమునన్ బ్రేతవృత్తి మాసె నతనికిన్. 30

వ. మఱియు నా దుంధుకారి. 31

మ. తులసీదామధరుండు పీతవసనాస్తోక ప్రభాభాసుఁడున్
జలదశ్యామల కోమలాకృతియు భాస్వద్రత్నకోటీర సం
కలితుండున్ మణికుండలోజ్జ్వలుఁడు దురుగ్రైవేయ హారావళీ
వలయోత్కంపితటిచ్చకచ్చకితదిగ్భాగుండునయ్యెన్ దుదిన్. 32

క. ఈరీతి నాతఁ డచ్యుత
సారూప్యము బొంది వినయ చతురత మ్రొక్కెన్
గూరిమితమ్మునిఁ; భవని
స్తారకు లెవ్వరైన వంద్యతములే గాదే. 33

వ. మఱియు నప్పావనమూర్తి శుక కథాసప్తాహ మహిమం బిట్లని
వినుతింపఁ దొడంగె వినుండు. 34

తే. గీ. భాగవతవార్త ధన్యతాపాదకంబు
ప్రీతపీడాహరంబు పవిత్రకరము
సప్తదినయజ్ఞమదియు సాక్షాదధీశ
పుణ్యలోకప్రదంబు నగణ్యఫలము. 35

క. తడిగల్గిన; దారినదియు
కడిదియుఁ దేలికదియైన కల్మష మగ్గిం
బడు కట్టెలటు దహింపం
బడెడిన్ సప్తాహఫలవిపాకము మహిమన్. 36

క. తెలిసియుఁ దెలియక జరిగిన
నలుసున్ బెద్దదియు వాఙ్మనస కర్మములన్
గలిగెడు పాపము దొలువం
గలిగెడు సప్తాహ దివ్యకల్పము వినరే! 37

ఉ. భారతభూమి వైదిక సఽభాస్థలినిల్చి, యుదారభక్తి నం
భోరుహనేత్రు దివ్యకథ ఽ పుణ్యముపంట వినంగలేని యా
క్రూరుని జన్మమేటి కొనఽగూడిన పిండము మెక్కి మాంస మ
జ్జారసధాతువుల్ బలిసి ఽ చచ్చెడువాని శరీర మేటికిన్. 38

చ. ఎముకలు కంబముల్, నరముఽ లిందు బిగించెడుకట్టుత్రాళ్లు, మాం
సము రుధిరమ్ము లేపనము; ఽ చర్మముపై నిడుకప్పు; పూతిగం
ధము క్రిమిభస్మవిడ్భర మఽదార్ఢ్యము, దుష్టము, దుర్భరంబు, సాం
తము, క్షణికంబు, రోగసదఽనంబు శరీరము నమ్మవచ్చునే. 39

క. మూత్ర పురీషాదులకున్
బాత్రమపాత్రం బపత్రఽపము చిత్రం బే
మాత్రము నస్థిరమగు నీ
గాత్రముఁ దిరమైనయుక్తి ఽ గడువం దగదే. 40

తే. గీ. భాగవత గాథ వినని యఽభాగ్యమతులు
సలిలబుద్బుదమట్లు, దోఽమల విధానఁ
బుట్టి పెరుగుట యది తుదఽముట్టుకొఱకు
నరకకూపంబునన్ బడి ఽ నవయుకొఱకు. 41

క. దినదినము దినాంతంబున
స్వాన మొనయఁగ నొక్కటొకటిఽవంతున వంశం
బున సప్తగ్రంథులు విడె
ననుమానమె? మనము గ్రంథిఽ యటువిడు నన్నన్. 42

క. ఖేదిల్లు మనసుముడి; వి
చ్ఛేదము గను సందియములు క్షీణములగు నా
మీఁద సకల కర్మంబులు;
సాదరమున విన రమేశ సప్తాహకథన్. 43

క. హరిగాథా తీర్థంబై
పరగిన చిత్తమున ఘోరభవపంకం బె
త్తెరగున నంటదు; మోక్షము
తిరపడు నద్దాన ననిరి తెలిసిన పెద్దల్. 44

—గోకర్ణ సప్తాహమున విష్ణుభక్తులు దుంధుకారిని దివ్యవిమానమునఁ గొంపోవుట.—

మ. అనుచుండన్ విమలప్రకాశవలయ వ్యాలోలమై దేవతా
జనసమ్మర్దమునై విమాన మొకఁ డాచాయన్ వినోదంబుగన్
గనిపించెన్; గని దుంధుకారియు విమానం బెక్కె, గోకర్ణుఁ డి
ట్లనియెన్ శ్రీహరి దాసులంగని యమందాశ్చర్య పర్యాప్తిచేన్.

శా. "శ్రోతల్ నిర్మలు లెందఱో కలుగ నిచ్చో దుంధులీసూనుఁడే
నీతుండయ్యెడు మమ్ము మాని యెదియేనిన్ గారణంబున్న సం
ప్రీతిన్ దెల్పరె"యన్నఁ బల్కి రిటు యుక్తిన్ విష్ణుదాసాగ్రణుల్
శ్రోతృత్వంబొకఁడైన నిందు మననారాధిన్ గడుం భేదమా. 56

మ. ఫలభేదమ్ములను దానఁగల్గు; నితఁడున్ భక్తి న్నిరాహార దీ
క్షల నిన్నాళ్ళును విన్న శ్రీహరికథాకల్యాణ వాక్శ్రేణి, ని
శ్చలబుద్ధిన్ మననంబొనర్చెఁ గనె నిస్సాహాయ్యమున్ మానిర్వ్యా
జ్జలజావాస కృపాకటాక్ష మిటు లీచ్ఛాయన్ బ్రవర్తిల్లెడిన్. 47

చ. నిలుకడలేనిజ్ఞానమును, నీమములేనిశ్రుతంబు, సంశయా
కులమగు మంత్రనిష్ఠ, మదికూడిక లేనిజపంబు, విష్ణుభ
క్తులకెడమైనచోటు, శుచిగూడనిదాన, మపాత్రయుక్తమై
పొలిచెడుశ్రాద్ధ, మశ్రుతునిబొందినదానము, వ్యర్థముల్ గదా.

క. గురువాక్యంబుల గురియిడి
తిరమగుమతి కథనుజేర్చి దీనతదోఁపన్,
జరిమి మనోదోషంబుల;
హరిగాథన్ విన్న ఫలము నప్పుడ కలుగున్. 49

క. ఈ కథ మఱొక్కపరి విన
వైకుంఠంబొదవుఁ, జదువ వనజాక్షుఁడు గో
లోకము నీ కొసఁగెడునని,
వైకుంఠనివాసు లాత్మపదవికి జనఁగాన్. 50

వ. గోకర్ణుఁడు. 51

ఉ. శ్రావణమాసమందపుడు సప్తదినంబుల శ్రీరమేశ గా
థా వితతిన్ వినం జదివెఁ దత్పరతం వినుచుండి రెల్ల రా
త్రోవను దోఁచె భక్తతతితోడను దివ్య విమానమందు ల
క్ష్మీవిభు మోహనాకృతి విచిత్రముగాఁ గనుపట్టె నంతటన్. 52

## తోదక వృత్తములు (తామరసములు)

జయ జయ మంగళ చారుతరాంగా !
జయ కరుణారస సార తరంగా !
జయ మునిమానస సారస భృంగా !
జయ సకలాఘ విచార విభంగా ! 53

జయ విమలాగమ సార ! మురారీ !
జయ కమలాస్తన శైలవిహారీ !
జయ సుజనాభయ సాధక ! శౌరీ !
జయ మునిశాత్రవ సంఘ విదారీ ! 54

జయ మధురాపుర సౌధ వినోదా !
జయ మురళీరవ సంగత మోదా !
జయ జయ సంహృత సంసృతి ఖేదా
జయ జయ పాలిత సన్ముని వాదా ! 55

జయ జయ ఖండిత శంకర చాపా !
జయ జయ దండిత శాత్రవ భూపా !
జయ జయ పండిత సన్నుత రూపా !
జయ జయ మండిత చారు కలాపా ! 56

మ. జయ గోవింద! ముకుంద! భక్తవరదా! సర్వజ్ఞ! సర్వేశ్వరా!
జయ కల్యాణగుణప్రియాభరణ! సంసారాబ్ధి నిస్తారణా!
జయ శిష్టావన దీక్ష! శిక్షిత విపక్షా! పక్షిరాడ్వాహనా!
జయ రాధారమణీ మన స్సరసిజాంచచ్చంచరీకా! హరీ! 57

చ. జయ జయ వేదశాస్త్ర సువిచారణ ఖేలన! భక్తపాలనా!
జయ జయ శ్రీ రమారమణ! చారు కళాకలనైక కారణా!
జయ జయ గోపికా జన వశంకర! శంకర! శంకరార్చితా!
జయ జయ! కృష్ణ! కృష్ణ! జయ! జన్మశతార్జిత పుణ్యలక్షితా!

మ. అని మ్రోసెన్ జయనాదముల్ దెసల;నయ్యబ్జాయతాక్షుండు స
ల్లన బూరించె నఘౌఘ నిర్మథన లీలాగణ్యమున్, భక్తపా
లన సౌజన్యము, సంస్కృతి జ్వలన కీలాజాల పర్జన్యమున్,
మునిసన్మాన్య,మనన్యసామ్యమహిమంబున్, బాంచజన్యం బొగిన్.

వ. అట్లు పూరించి; కరుణారసతరంగితాంతరంగుండై చెంగుసం
దరిసి, 60

శా. గోకర్ణున్ హరి కౌఁగిలింప; నతఁడున్ గోవింద సారూప్య సు
శ్రీకుండయ్యెను; శ్రోతలున్ హరి సమాశ్లేషమ్మునన్ జొక్కి;లో
కైకారాధ్యులు పీతవాససులు సుశ్యాముల్ రథాంగాదినా
నాకలోజ్జ్వల దివ్యవేషధరు లాత్మారాములై రందరున్. 61

క. గోకర్ణు కృప, ముకుంద క
థాకర్ణనమునను గులము లల్పము లనకే
చేకొని విమానముల హరి
లోకమ్మున కరిగి నూరికలోఁ గల జీవుల్. 62

మ. హరి గోకర్ణునితోడ గోపజన గమ్యంబైన గోలోకముం
దరియం బోయెను, దత్కథాశ్రవణ సాంద్రప్రీతులై భక్తులం
దరు వెంటాడిరి రాముతోఁ జనుసయోధ్యావాసుల;ట్లొండెడం
దరియం వచ్చునె సోమ సూర్య సుర సిద్ధశ్రేణికే నీ గతుల్.

క. ఒక మాఱైనను గోక
ర్ణకథాక్షర మెనయ గర్భనరక మ్మెడమా
నిఁక సప్త దిన కథా య
జ్ఞ కలాపంబు మహిమంబు శక్యమె పొగడన్. 64

ఉ. ఆకులు, నీరు, గాలి దిని; యగ్గి సెగం దలక్రిందుగాఁ దపం
బేఁకట మోగవృత్తిఁ జరియించి కృశించి శరీర మస్థిమా
త్రాకలితంబునైనఁ; గమలాక్షు కథాధ్వరస ప్తరాత్రి దీ
క్షా కమనీయ సంపదను గల్గు గతుల్ సమకూడనేర్చునే ? 65

మ. ఇతిహాసం బిది చిత్రకూటమున ముక్కన్నె కాగ్రతం విన్న స
త్ప్రతిశాండిల్యమునిప్రవేకుఁడునుబొంక దేం బ్రహ్మతాదాత్మ్యముం;
బితరుల్ దృప్తివహింతు రిశ్రాద్ధముల దీనిం బాడినం విన్న ను
ద్గత పాపప్రచయంబడంగు, నొదవుం గైవల్యసామ్రాజ్యముం.

వ. అని సూతుఁడు దెల్పిన నమ్మునివరు లా సనకాది కథావిధానం
బానతీఁగదే యని యడుగుటయు; 67

చ. గుహ శబరీ జటాయు కపి కుంజర వార్ధి విభీషణాది స
న్నిహిత కృపాకటాక్ష! రణ నిర్జిత నిర్జర వైరిపక్ష! భూ
దుహితృహృదంతర ప్రణయ దుగ్ధపయోధి తరంగమాలికా
విహృతి చణ! క్షణక్షణ నవీభవదద్భుతకీర్తి భూషణా! 68

క. కరుణారస వరుణాలయ!
శరణాగత శత్రుమిత్ర సంరక్షణ! సం
సరణాబ్ధి తరణ! సుగుణా
భరణా! సురచారణాది వందిత చరణా! 69

కవిరాజవిరాజితము.

అఘహర! గాధిసుతాధ్వర విఘ్నహరా! శ్రితలోక మహాత్ఫలదా!
మఘవదరి ప్రవిమర్దన దుర్దమ! మారుతిసేవిత మంజుపదా!
సుఘటిత విక్రమ! సూనృతవాక్య! విశుద్ధ యశస్స్థిర! సూరివరా!
రఘువర! సత్కవిరాజ విరాజిత రమ్యకథానక! రామవిభూ! 70

గద్య. ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్షవీక్షా సమాసాదిత
కవితాకళాంచిత శ్రీవెంకటసుబ్రహ్మణ్యదీక్షిత ప్రణీతంబైన
భాగవత మాహాత్మ్య మను ప్రబంధమునఁ
—: బంచమాశ్వాసము :—



శ్రీ

# భాగవతమాహాత్మ్యము

## షష్ఠాశ్వాసము



దశరథతనయ! వశి
ష్ఠాది బ్రహ్మర్షి నుత మహాద్భుతలీలా
మోదా! మోదావహమ
ర్యాదా! కోదండరామ! రఘుకులసోమా! 1

వ. అవధరింపుము సూతుండు శౌనకాది మహర్షుల కిట్లనియె, నంత
సనకాదులు నారదునితో నిట్లనిరి. 2

తే. గీ. అభినుతింతుము వినుము సప్తాహమఖ వి
ధానము; ధనంబు బలగంబు పూని నడుప
నొప్పు దొలుదొల్త దైవజ్ఞు నొకముహూర్త
మడిగి, కొననగుఁ బెండ్లికైనంతధనము. 3

తే. గీ. వరుస నాషాఢ సభముల భాద్రమందు
నాశ్వయుజమునఁ గార్తికమందు మార్గ
శీర్షమున దుష్టయోగముల్ సేరకుండ
మొదలిడి వినంగ శుకగాథ మోక్షమిచ్చు. 4

క. ఎయ్యె మాసములన్ విధు;
లెయ్యవి తినరాని వనియొకనివి విడువనగున్
నెయ్యమునఁ గార్య దక్షుల
నయ్యెవారల సహాయ ƒ మర్థింపనగున్. 5

వ. (చైత్రమునఁ జితాన్నమును, వైశాఖమున గుమ్మడి, కరివేమును, జ్యేష్ఠమునఁ బానమును మోదకమును, నాషాఢమున నులవలును, శ్రావణమున నాకుఁ గూరలును, భాద్రపదమునఁ బెరుగును, నాశ్వయుజమున క్షీరమును, గార్తికమున ద్విదళములును, మార్గశీర్షమునఁ గందంబును, పుష్యమునగాజరయు, నీరుల్లియును, మాఘమున రక్తమూలములును త్యాజ్యంబులు.) మఱియు; 6

మ. సకుటుంబంబుగ రండు శ్రీహరికథా ƒ సప్తాహసందర్శనో
త్సుకులై మీరును మీరు మీరనుచుఁ దోడ్తో దూరదూరస్థులై
న కథాసక్తుల విష్ణుకీర్తనులనున్ ƒ రావించి, స్త్రీ శూద్ర బా
లక వర్గంబునకేని తేటపడు లీలన్ దెల్పనే నీకథన్. 7

ఉ. శ్రీహరిభక్తులార ! దయƒసేయుఁడు భక్తిసమాజ మిందు స
ప్తాహవిధిన్ రమాధిపు కƒథామృతపూరము పంచిపెట్టు న
వ్యాహతిఁ గ్రోలవచ్చునది ƒ బాంధవ పుత్ర కళత్ర మిత్ర స
న్నాహముతో; నలభ్యము ఘƒనంబగు నీక్షణ మేక్షణమ్మునన్. 8

తే. గీ. అనుచు శుభలేఖములు వ్రాసి యనుపవలయు
దేశదేశంబులకు; శ్రీరంగమేశ భక్త
వరులు శ్రీకృష్ణకీర్తనాదరులు యతులు
దూర దూరంబులందుండి చేరుకొనఁగ. 9

కం. వినువారు గూరుచుండుట
కనువైన విశాలరంగ మది తీర్థంబో
వనమో, గృహమో, తగు శో
ధన మార్జన లేపనములఁ దనరినచోటన్. 10

వ. ఏర్పాటుచేసి, 11

మ. కదళీమండిత మండపంబున నలంకారంబు గావించి, శ్రీ
ప్రదమా కేతనమెత్తి, పుష్పఫల పర్ణశ్రేణులన్ గూర్చి య
య్యదనన్ జాందిని దీర్చి, మెట్లబడి నక్కయ్యాలోకముల్ సేర్చి; వై
దు దినాల్మ్రుం దుచితాసనంబు లిడనౌఁ దోతెంచుభక్తాళికిన్. 12

తే. గీ. విప్రులన్ బ్రహ్మభూతులన్ బిలిచి యగ్ర
పీఠ మిడి పూజసేసి; యా వెనుక చదువు
వారు వినువారు తూరుపు పడమరలను
నొండొరుల కభిముఖముగా నుండవలయు. 13

క. వినిపించు విప్ర మహితా
సనమున నాసీనుఁజేసి సముచితకాలం
బును దేశము తరతమతయుఁ
గని, వచ్చినవారి పూజ గావింపనగున్. 14

తే. గీ. విష్ణుభక్తుండు విప్రుండు ♦ వేదశాస్త్ర
నిరతుఁడు విరాగి దృష్టాంతనిపుణమతియు
ధీరుఁడున్ నిస్పృహుండు నాచారపరుఁడు
నైన పుణ్యుండు వక్తగా ♦ నమరవలయు. 15

(వ. మఱియు వక్తయగు నాతఁడు; కథను విస్తరింపను గుదియింపను సమర్థుండును, కథాదరుండును; ప్రస్తావనాకుశలుండును, సత్యవచనుండును, సందేహవినివారకుండును, సకలశాస్త్రకుశలుండును, నవాంతరాఖ్యానోపాఖ్యాన విశేషవివేచనక్షముండును, నవ్యంగ్యవచనుండును, జనరంజకుండును, సభాజేతయు, నహంకారాది వర్జితుండును, ధార్మికుండును, సంతానవంతుండునై యుండవలయు.)

ఉ. పండితులై విభిన్నమతవర్తనఁ జిందులుద్రొక్కు మూర్ఖపా
షండ వితండ వాదులను ♦ *స్త్రైణుల నాపొలిమేరకేని రా
కుండ నొనర్చఁగా వలయు ♦ నూర్జితమౌ శుకశాస్త్ర సత్కథా
ఖండ రసాబ్ధిపొంగి తొలిఘట్టము దాకఁగఁ బూనువేళలన్. 17

చ. తెలిసినవాఁడు సందియము ♦ తీరిచి లోకము బోధసేయగా
వలయనివాఁడు వక్తకు సహాయతఁ బార్శ్వమునం జరింపగా
వలయును; వక్తయున్ దొలిదినంబు వ్రతాప్తికి దీక్షఁబూని, ని
చ్చలు నరుణోదయంబునకు ♦ శౌచవిధుల్ బొనరింపగానగున్.

---

* స్త్రైణులు = స్త్రీవ్యామోహితులు. స్త్రైణాః – స్త్రీ సంబంధినః. స్త్రీషు సక్తా ఇత్యర్థః. అనివ్యాఖ్య.

ఉ. సందెజపంబు క్లుప్తముగ సల్పిన దోసము రాదు; విఘ్నముల్
పొందకయుండ విఘ్నపతి మ్రొక్కి, పితృప్రకరంబు గొల్చి, శు
ద్ధిం దగు పాచితంబులను దీరిచి మంత్రనియుక్తి మండలం
బందున విష్ణు గొల్చి మఱియంజలిసేసి ప్రదక్షిణంబులన్. 19

## విష్ణుధ్యానము

సీ. నీలమేఘశరీరు నీరజదళనేత్రు
లలిత సువర్ణ చేలంబువాని
నవరత్నఘటిత సుందర కిరీటమువాని
తత భుజాకలితాంగదములవాని
జలజాత వరశంఖచక్ర కౌమోదకీ
సమలంకృత కరాంబుజముల వాని
కౌస్తుభ వనమాలికా రత్నఘటిత ము
క్తాహార రుచిరవక్షంబువాని
తే. గీ. మకరకుండల మండిత మధురహాస
చంద్రికాసార సుమధురాస్యంబువాని
పంకజావాసు విద్యుత్ప్రభావిభాసు
నుదయ భానువిలాసు నెమ్మది భజింతు. 20

శ్లో. "కృష్ణం భాస్వత్కిరీటాంగదవలయ కలాకల్పహారోదరాంఘ్రిమ్
శ్రోణీభూతస్వవక్షోమణిమకర మహాకుండలామండితాస్యమ్
హస్తోద్యచ్ఛంఖ చక్రాంబుజగదమమలం పీతకౌశేయవాసమ్
విద్యుద్భాసం సముద్యద్దినకరసదృశం పద్మసంస్థం భజామి". 21

వ. అని పుండరీకాక్షుని దివ్యమంగళాకారంబును ననుసంధించి నుతిం
చుచు. 22

క. కరుణాభరణా! భవ సా
గరమందు మునింగి మోహగతులంబడి వే
దిరుగాడు నన్నుఁ దేల్పుము
పరమేశ్వర! భక్తలోక బాంధవ! కృష్ణా! 23

క. అని పొగడి భాగవతమున్
గని ప్రీతిన్ ధూపదీప నైవేద్యాద్య
ర్చన లిడి శ్రీఫలముంగొని
వినుతింపన్ వలయు నిట్లు విష్ణుఁ జిష్ణుఁ. 24

## కృష్ణస్తుతి.

శా. శ్రీమద్భాగవతంబు నీవ యని యర్చింతున్ రమేశా! పరం
ధామా! సంసృతివార్ధి దాటుటకునై దాసుండనై; విఘ్న మిం
దే మాత్రంబు పొసంగనీక దయ నీ వీకోర్కె జెల్లింపు శ్రీ
రామానందతపఃఫల ప్రచురసారారామ రమ్యాకృతీ! 25

వ. అనియిట్లు నుతియించి యిక్కథావక్తయగు వారిం గని. 26

వ. సురుచిర వస్త్రభూషణ వసుప్రకరంబులఁ గానుక వెట్టి, ని
ర్భరమగు భక్తిఁ దచ్చరణపంకజముల్ నుదురంట మ్రొక్కి, శ్రీ
హరికరుణాకటాక్షముల నబ్బిన భాగ్యము దామటంచుని
క్కరణి నుతింపఁగానగు నఖండరసస్ఫురణాభిరామతన్. 27

## పౌరాణిక స్తుతి.

శా. శ్రీమద్భాగవతావతంస! విదితాశేషాగమ! జ్ఞాన ము
ద్రామూలజ్ఞ! శుకస్వరూప! పరమోదారా! రమానాథ గా
థామాధుర్య వివేక సారచతురా! తత్త్వజ్ఞచూడామణీ!
కామాద్యంతరరిప్రభేదనరతీ! కల్యాణ వాక్యోన్నతీ! 28

తే. గీ. అనినుతించుచు హరిరూపమైనవాని
నోడలెఱుంగక హరికథల్ నెడువాని
సప్తదినములఁ దనశక్తిసరణిఁ బూజ
సలుపఁదగుఁ బంచభక్ష్యాన్నముల నొసంగి. 29

తే. గీ. అంబుజోదరు దివ్యకల్యాణగాథ
వినుచు వేళల విఘ్నమ్ము లొనరకుండ
వరణ లీ నగు ద్విజులైదుగురకు నందు
ద్వాదశాక్షర మంత్రజపంబు సలుప. 30

మ. హరిగాథారతులైన బ్రాహ్మణులఁ దానర్చించి సంకీర్తన
త్వర నేతెంచిన భక్తులంగొలిచి, విత్తక్షేత్రదారాసుతో
ద్ధుర సంపన్న గృహాభిమానమెదలోఁ దూలించి యేకాగ్రతా
స్ఫురణన్ శ్రీశుచరిత్ర విన్ననతఁ డొప్పున్ దత్ఫలాసంగియై. 31

(వ. మఱియును శ్రోతయగునాతఁడు, పౌరాణికునెడ భక్తి కల వాఁడును, నగర్వితుఁడును, నచంచలమతియు, ధీరుఁడును, బ్రశ్నజ్ఞుఁడును, బహుశ్రుతుఁడును, ననలసుఁడును, నిద్రాదూరుఁడును, బుద్ధిసంపన్నుఁడును, దాతయు, నన్యకథావిముఖుఁడును, శుచియును, దంభరహితుఁడును, గావలయునని పెద్దలు తెలుపుదురు)

వ. తదనంతరంబు. 33

చ. రవియుదయించినంతఁ బ్రహారత్రితయంబుఁ దదర్థమున్ గథా
ప్రవచనముం బొనర్పనగు; భక్తి గభీరవచః ప్రసక్తిచే;
నవలవిరామమున్ దగు దినార్ధముననన్ ఘటికాద్వయంబు; మా
ధవునపుడెల్లభక్తులు ముదమ్మున సన్నుతి సేయగా నగుఁ. 34

చ. సరసములైన భావములు జాల్కొన, శాంతముగన్ మనోహర
స్ఫురణముదోఁప, నచ్చెరువు పుట్టఁగ, నర్థము తేటతెల్లమై
పరగఁగ, నక్షరమ్ములును పల్కులుస్పష్టపడఁ ద్విజాదులం
దరకు శుకోక్తులన్ వినుచుధన్యుఁడు వ్యాస సమానుఁ డిద్ధరన్.

(*వ. మఱియును సప్తాహ కథాప్రవచన క్రమమునఁ గొండొక విశేషంబు పురాణాంతరంబులఁ జూపట్టెడు నదెట్టులనినఁ; బ్రథమ

* ఇందులకుఁ బఠాంతరముఁ గలదు.

ప్రథమదివసంబున, హిరణ్యాక్షవధయును, ద్వితీయంబున భరతచరిత్రయును, తృతీయమున సముద్రమథనమును, రామావతారప్రాదుర్భావఘట్టంబును, జతుర్థంబున, దశమస్కంధమున. కృష్ణావతారఘట్టంబును, బంచమంబున రుక్మిణీకల్యాణమును, షష్ఠంబున నుద్ధవసంవాదమును, సప్తదివసంబున నవశిష్టకథా భాగంబును బూర్తిచేయవలయును.

దివసంబున, వరాహావతారచరిత్రంబును, ద్వితీయంబున భరత చరిత్రంబును, తృతీయమున నృసింహావతారావిర్భావ ఘట్టంబును, చతుర్థంబున వంశవర్ణనమును, పంచమమున గురులీలా వృత్తంబును, షష్ఠంబున లీలాసమాప్తియు, సప్తమంబున శుక పూజా విశేషంబును వినిపింపవలయును.) 36

వ. ఇట్లు సప్తాహవ్రతమున భక్ష్యాభక్ష్య విచారం బెట్టిదనిన. 37

సీ. కర్మేంద్రియ జయంబు గలుగ లఘ్వాహార
నియమంబు పాటింప నెగడు సుఖము;
పాలు, నేయియు నవ్య ఫలము హవిష్యంబు
నేక భుక్తమ్మును నిచ్చు ముదము;
బలమున్న నుపవాసములు సప్త రాత్రంబు
హరిగాథ వినుట శ్రేయస్కరంబు
కాక యాకలిని జీకాకు నొందెడు కంటె
దినిశ్చయైన వినుట సన్మునిమతంబు
తే. గీ. చిత్త మేకాగ్రమై కథన్ జేరకున్న
నవల యుపవాసఫల మొకింతైన లేదు;
కథ కనువుగాని దదియెల్లగానిదయగు
నైన దానది యగు సాధ్యమయ్యె నేని. 38

(వ. కథావ్రతియగు నాతఁడు; గరిష్ఠాన్నంబును (నూనె బెల్లము గలిపి వండినది) మనోదూషితంబును, పూర్వదిన పాచితంబును

(పర్యుషితంబును) ద్విపాచితమును, సూతకకరానీతంబునగు నన్నం
బును; మత్స్యమాంసమును, మేకపాలును, భూ,జలసంబంధములగు
లవణంబులును, పడియనీరును భక్షింపరాదు. హరికథా తత్పరుం
డగు నాతఁడు, ములగ (వాకుడు) మెసగఁజనదు; పొట్ల వలన
వృద్ధి హానియు, ముల్లంగివలన బలహానియు, మారేడువలనఁ
బాపమును, వేపవలనఁ బశుయోనియు, కరివేపవలన మూర్ఖ
తయు, గంజాయి, యానపల వలన గోమాంసభక్షణ దోష
మును *పూతిక వలన బ్రహ్మహత్యాదోషంబును, నీటివంగనలన
సంతాననాశనమును, మాంసము వలన దీర్ఘరోగమును గలుగును
గావున నివి సప్తాహవ్రతస్థులు భక్షింపరాదని పురాణాంతరంబుల
వినంబడు) 39

♦ద్విదళంబులగు ధాన్యంబులును, తేనె, నూనెయు సప్తాహయజ్ఞ
పరుల కభక్ష్యంబులని చెప్పంబడె; వెండియు. 40

తే. గీ. వినుమునారద! సప్తాహ విధిని; దీని
విష్ణు దీక్షావిహీనులు వినఁగఁదగరు;
బ్రహ్మచర్య వ్రతాప్తియుఁ బత్రిభుక్తి
నెగడుతఁ గథావసానాన నియమభుక్తి. 41

---

*పూతిక నెమిలడుగుచెట్టు. కొమ్మ్రన గొజ్జిపిండిచెట్టు అనికొందరు.

♦ద్విదళములు, (పప్పుదినుసులు) మినుములు; పెసలు, చిఱుసెనగలు, సెనగలు, ఉలవలు, అనుములు, అలసందెలు, కందులు.

"శిలాయాం భిద్యమానస్య ద్విదళం జాయతేయది
తదేవ ద్విదళంధాన్యం వ్రతాదౌచ వివర్జయేత్".

తే. గీ. వేదముల విష్ణుభక్తుల ♦ విప్రవరుల
గురుల గోవులనున్ పరిత్రాణచరణరతుల
వనితలను రాజులను బెద్దవారి దూర
వలవ దీశ్వర సత్కథాపరిత పరునకు. 42

మ. పలుకం రాదు రజస్వలాంత్యకులజ ♦ వ్రాత్యాళితో, వేదబా
హ్యులతో, మ్లేచ్ఛులతో, ద్విజప్రతిభటవ్యూహంబుతో; దీక్షలం
వలయున్ సత్యము శౌచమార్జవ కృపానమ్రత్వముల్ మాన మె
వ్వలనన్ మాధవ సత్కథాపరితవిధివ్యాసంగికిన్ నిచ్చలున్. 43

క. నిరుపేద, క్షయి, యభాగ్యుఁడు
దురితము గలవాఁ డపత్యదూరుఁడు రోగా
తురుఁడున్ మోక్షాదరుఁడుం
హరిచరితము విని తరింపనగుదురు ధరణిం. 44

*క. కలుగనిది, కలిగిలేనిది,
కలిగియు నొక కాను పెడము ♦ కలిగిన, దొకటిం
గలిగిచెడినయదియు, రజ
స్వలకానిది, పడఁతి వినఁగ ♦ సరి శుకగాథం. 45

---

*"శ్లో॥ అపుష్పా కాకవంధ్యాచ వంధ్యా యాచమృతార్భకా
స్రవద్గర్భాచయానారీ తయా శ్రావ్యాప్రయత్నతః" అనిమూలము.

క. వీరలకు యథావిధి నం
భోరుహాలోచనుని చరిత్రమును వినిపింపన్
జేరు ఫలం బక్షయ్య మ
పారమ్మది కోటియజ్ఞ ఫలదము వింటే. 46

క. మఱి కృష్ణాష్టమి వ్రత విధి
యొఱవడి నుద్యాపనంపు టుత్సవముతుదన్
నెఱపందగు ఫలకాంక్షులు
తఱిఁ గృపణులు గాక మోక్షతత్పరులగుచున్. 47

చ. ఇటు సప్తాహము పూర్తియై వినెడు వాగ్రీగ్రంథమున్ వక్తనం
తటఁ దామున్ గయినేసి నవ్యతులసీదామంబులన్ సర్వ ది
క్తటముల్ మ్రోయమృదంగతాళ జయ శంఖధ్వానమోంకారసం
ఘటనన్ గూర్పగ భక్తి తత్పరత నాకంజాక్షుఁగీర్తించుచున్. 48

చ. అడిగిన విత్తమున్ సురుచిరాన్నము విప్రుల కగ్గి కోటిక
ట్లిడి, మరునాడు గీతపఠియించుత శ్రోత్రివిరక్తుఁడేని; యా
తఁడు గృహియైన హోమము యథావిధి సేయుతఁ గర్మశాంతిచో
ప్పడరఁదిలాన్నముల్ మధువునాజ్యము పాయసముల్ హావిస్సుగన్.

♦తే.గీ. దశమమునఁగల్గు శ్లోకముల్ కై దానఁగూర్చి
యేని, గాకున్న గాయత్రి కై యేనిఁగూర్చి
హవన మొనరింపవలయు గాకయత్రిరూప
మగుటచే భాగవతము తకత్త్వార్థమరసి. 48

ఉ. హోమము సేయలేనియెడకై†హోమపదార్థము దానమిచ్చినన్
గామిత సిద్ధియౌ; శుభము కై గల్గును; విష్ణుసహస్రనామముల్
నేమమునన్ బఠింపమఱికై నెక్కొను దోసము లంతరించు; నిం
కేమననౌ సమగ్రఫలకై మేర్పడుఁ దద్వ్రతపూర్తి గల్గినన్. 49

---

♦భాగవతమున దశమస్కంధమున 'బ్రహ్మస్తుతి' శ్లోకములను గూర్చి కొని పూర్వార్ధ హోమమును, శ్రుతిగీతలను గూర్చుకొని యుత్తరార్ధ హోమమును జేయవలయును. ప్రత్యధ్యాయ సమాప్తియందును మంత్రాష్టకమును జపింప వలయును.

శ్లో. బ్రహ్మస్తుతిం సముచ్చార్య పూర్వార్ధహవనం చరేత్
వేదస్తుతిం పఠిత్వాథా ప్యుత్తరార్ధాహుతిం చరేత్
ప్రత్యధ్యాయం సమాప్తౌ చ మంత్రాష్టక ముదీరయేత్.

† హోమపదార్థములు, పాలు, పెరుగు, యవల సారము, నెయ్యి, అన్నము, బియ్యము, సోమము, మాంసము, నూనె, నీళ్ళు. ఇవి హోమ్యములు, అని ఆశ్వలాయన భాష్యము. మాంసము కలి యందు వర్జ్యము – దానిస్థానమున ఉప్పు – పాలును గలిపికాని, గేదెపాలు మినుములు గలిపికాని హోమము చేయవలయు ననిశాస్త్రము.

కం. పదియిద్దరు బ్రాహ్మణులకు
ముదమున మధుపాయసముల ♦ భోజనమిడి, స
ప్తదిన వ్రతపూర్ణతకై
మొదవును స్వర్ణంబు నొసఁగఁ ♦ బోలుఁ గృతికిన్. 50

సీ. కలిమిగల్గిన మూడు ♦ పలముల మితిగల్గు
స్వర్ణంబు సింగంపుఁ ♦ బ్రతిమ సేసి,
సచ్ఛందనాంబర ♦ స్వర్ణభూషాశ్రేణి
నలరించి దక్షిణ ♦ లందు నిలిపి,
లలితతరాక్షరాలంకృతంబైనట్టి
భాగవతంబు నా ♦ ప్రతిమ నునిచి,
యావాహనాదుల ♦ నర్చించి నియతాత్ముఁ
డైన యాచార్యున ♦ కదియొసంగ

తే. గీ. వలయు ధీమంతుఁడదియు; పాపములఁదొలఁచు
భాగవత సత్పురాణంబు ♦ భద్రదంబు
ధర్మకామార్థ మోక్ష సాధనము ధనము
ధనము లింకేల కర్మబంధనములేల ? 51

మ. అని యమ్మౌనికుమారు లచ్యుతకథా ♦ వ్యాసక్తిఁ సర్వ భూ
తనికాయంబునకున్ ముదంబునిడి; రంతన్ భక్తియుప్పొంగుచున్
దనయుల్ దానును యౌవనంబును మహానందంబు సౌంధర్యమున్
గని ప్రేమైకరసాకృతిన్ బొలిచె భక్తశ్రేణి జేపట్టఁగన్. 52

మ. సురమౌనీంద్రుఁడు ధన్యుఁడైతి ననుచున్ § సాంపారనానంద ని
ర్భరతన్ మై పులకింప గద్గదిక దోఁపన్ బల్కెఁ గేల్మోడ్చి "స
త్కరుణామూర్తులు మీరాయనుగ్రహమునన్ § గంజాక్షు చారిత్రముల్
వరుసన్ వింటి, ముకుందుఁ గంటి, మఱియూ § భక్త్యున్నతిన్ గాంచితిన్

కం. శ్రవణంబె సర్వధర్మ
ప్రవరంబని యెఱిఁగికొంటి § వైకుంఠుం డు
త్సవమొనరించును సులభుం
డవుచున్ శ్రవణప్రసక్తి § నద్భుతరక్తిన్" 54

వ. అని యిట్లు నారదుండు వినుతించుచుండ. 55

శుకుఁడు ప్రత్యక్షమై భాగవతమును బ్రశంసించుట.

చ. ముసిముసి నవ్వువెన్నెలల § బోధ సుధారస వార్ధిపొంగఁగన్
మిసమిస లేఁత జవ్వనము § మించఁగ, మేని సువర్ణకాంతులున్
దెసదెసఁ గ్రమ్మ, నయ్యెడ మునిప్రవరుండు శుకప్రభుండు కై
వసముగ నాత్మసిద్ధి; కృతి § పాడుచు నాడుచు వచ్చెఁ జెచ్చెరన్.

ఉ. వచ్చిన దివ్యతేజుఁగని, § భక్తవరుల్ నతిసేసి యాసనం
బిచ్చి సపర్యవెట్టిన, మునీంద్రుఁడు నారదుఁడున్ ముదంబు పెం
పచ్చుపడంగఁ బూజలిడె; § నమ్మునిచంద్రుఁడు నంతభక్తిసం
పచ్చటులంబులౌ నుడుల § భాగవతంబు నుతించె నివ్విధిన్.

చ. నిగమకలాప కల్పతరు నిర్గళితంబు, శుకాస్య నిస్సృతం
బగుఫలమందు భాగవత; మందమృత ద్రవవాహినీతతుల్
జగతిఁ జరించు; నైక్యఫల సాధన కయ్యది క్రోలుఁడయ్య తృ
ప్తిగ రసికావతంసులగు ధీరులు బ్రహ్మపదంబు జేరగన్. 58

చ. కలుషములేని ధర్మ మిటఁ గల్గు; నమత్సరులైన వారి కిం
దలఘు దురంత తాపపరిహారక వాస్తవ వస్తుబోధయున్
గలుగు; శుకోక్త భాగవత కల్పసమాశ్రయు లీక్షణంబులో
నిలుపుదు రీశ్వరుం గదల నీక యిఁ కెయ్యదియింత కొప్పెడిన్.

తే. గీ. పరమ హంసైక సేవ్యంబు భక్తధనము
సత్యమేక మఖండ విజ్ఞానమయము
భక్తిబోధ విరాగ సంపత్ప్రదంబు
శ్రీశుచరితంబు నైష్కర్మ్యసిద్ధిదంబు. 60

శా. కైలాసంబును సత్యలోకమును స్వర్గంబెల్ల వైకుంఠమున్
గాలింపన్ లభియింప దియ్యమృత మే కాలంబునం దెట్టి పు
ణ్యాలంకారుల సేవనోకలుగు భాగ్యం; బిద్ది సిద్ధించుచో
నాలస్యంబొక యింతయేనిఁ గొన కాస్వాయంబునం గ్రోలుఁడీ.

వ. అని యిట్లు పలుకుచున్నంత. 62

మ. బలిప్రహ్లాదుఁడు నుద్ధవుండు నరుఁడున్ భక్తాళియుందోడరా
జలజాక్షుండు నటించెముందట మహాశ్చర్యమ్ముగాఁ బూజలన్
సలిపెన్ దేవమునీంద్రుఁ డంతసభలో, సాధూత్తముల్ హర్షసం
కలనన్ గీర్తనసేసి రచ్యుతకథా కల్యాణగీతంబులన్. 63

క. భవుఁడు భవానియుఁ గమలో
ద్భవుఁడుం బ్రత్యక్షమైరి తత్సభను మనో
భవ జనక దివ్యగాథో
త్సవ సన్నాహంబుగ ననుదారప్రీతిన్. 64

లయవిభాతి.

వరుస సనకాదిమునివరులు జయనాదములు
జరుపసురవైరి సుతుఁడరసి లయ నింపన్,
స్వరనిపుణతల్ మెఱయ పరవశత దేవముని
సరసముగ వీణ హరిచరిత పలికింపన్,
తరళయుతి నుద్ధవుఁడు పరవఁగను గాంస్యరుతి
నరుఁడు కృతిరాగయుత సరణి వినిపింపన్,
సురపతి మృదంగగతి నెరప శుకమానిహరి
పరత మృదుభావరస భరము వెలయింపన్. 65

లయగ్రాహి.

అందముగ భక్తియును నందనులునుం దరిసి
సుందరమునౌనటనఁ గ్రిందు కొనియాడన్,
విందయిన గానముల డెందము లమందగతి
నందసుతు నందె నిలుపొంది తనివొందన్,
సందియము వీడి మునిబృందములు! మీమనసు
నం దవులు కోర్కె లడుగందగు నటంచున్
సందడి యొనర్పగ ముకుందుఁగని యిట్లనిరి
వందనము లిడి జనము లందరనువొందన్. 66

శా. శ్రీసప్తాహమహోత్సవమ్ముల నినున్ జింతించుచున్ బాడుచున్
నీసేవారతిఁ బొల్చు భక్తతతికిన్ నిక్కంపుఁ బ్రాపై శుభ
శ్రీసంధింపు మిఁ కేమిగావలయు తండ్రీ! మాధవా! యన్న నౌ
నౌసర్వంబటులౌ నటంచుఁ జనెనయ్యబ్జాక్షుఁ డప్పట్టునన్. 67

చ. శుకముఖయోగిపుంగవులఁ జూచినమస్కృతిసేసె నారదుం;
డకలుషవర్తనన్ హరికథామృత మానిరి భక్తులెల్ల, రా
శుకముని భక్తినిన్ సుతులసొంపుగ నిల్పె స్వకీయశాస్త్రమం
దిఁక హరిరూపమై పరగు నీ కథ సాధుజనైకసేవ్యమై. 68

మ. జ్వరమై పేదరికంపు దుఃఖము దహింపన్; మాయ పైశాచిక
స్ఫురణన్ గన్నులుగప్పి మొత్త; భవమంభోరాశియై మ్రింగ; ని
బ్బరముల్ దక్కి తపించు లోకులను గాపాడన్ శుకప్రోక్తమా
హరిగాథాకృతి గర్జసేయు శరణంబై మూఁడులోకంబులన్. 69

వ. అని పలికిన శౌనకుండు వెండియు సూతున కిట్లనియె. 70

కం. శుకుఁ డెప్పుడువలికె; మఱి ధే
నుకుమారుం డెప్పుడు సదివెనో; సనకాదుల్
ప్రకటించి రెప్పుడు ముని కిది;
సకలము వివరింపు నాదు సందియము విడన్. 71

వ. అనిన సూతుం డిట్లనియె. 72

కం. హరి సనినఁ గలినిముప్పది
వఱకేండ్లరుగంగ భాద్రపద శుద్ధమునన్
వర నవమి మొదలుగా భూ
వరునకు శుకమౌనివినిచె భాగవతంబుల్. 73

ఆ. వె. మును బరీక్షితుండు వినినపిమ్మట రెండు
వందలేండ్లు నిండ భాగవతము
వించె ధేనుసుతుఁడు విధియుక్తి నాషాఢ
శుద్ధ నవమి నాత్మశుద్ధి కలిమి. 74

కం. సనకాదులంత కలియుగ
మున ముప్పదియేండ్లు గడువ మును గార్తిక మం
దున శుద్ధనవమి మొదలుగ
వినిచిరి సురమౌని కిది వివేకధురీణా ! 75

కం. అనఘా ! శౌనక ! యడిగితి
వని వినిపించితిమిదెల్ల హరిగాథ రసా
యనమై, భవరోగవినా
శనమై కలి నలరు సాధుసంసేవనమై. 76

శా. కైవల్యంబిడుఁ; గశ్మలంబుదోలఁచున్ గంజాక్షు మెప్పించు; భ
క్త్యావిర్భూతినిఁగూర్చు; శ్రీహరిలసత్ గాథాసుధల్ ధీరులై
త్రావుం డాత్మహితార్థశోధకత, లుబ్ధప్రార్థనాసక్తినే
లా వేగింతు రమూల్యకాలము ననిత్యానందలౌభ్యంబునన్. 77

మ. దరియంబోకుము మాధవస్తుతికథా తాత్పర్యసమ్ముగ్ధులౌ
నరులన్ గింకర! నీవునేను నొరులన్ శాసింతుమేగాక; శ్రీ
హరిదాసావళిపైన రాజసములా హా! చెల్లఁబోవంచుఁ గిం
కరు వెంటన్ జెవినూదియూది మరలున్ గాలుండుసంత్రస్తుఁడై.

మ. వ్రతముల్ యోగసమాధులున్ శ్రుతిచయవ్యాఖ్యానసిద్ధాంతధీ
చతురత్వంబు ఫలింపఁబోలవిటుపై; సప్తాహయూపాద్భుత
క్రతుసంబంధి కథారసావభృథ ధారాసిక్తమైగాక యీ
క్షితి నీ దుష్కలికాల కల్మష మహాగ్నిజ్వాల చల్లారునే? 79

తే. గీ. సారమింతయులేని సంసారమునను
విషయ విషసంగతిన్ బుద్ధి వికలమైన
దేనిఁ ద్రావుఁడు శుకవచోమృతము; సుఖ మొ
సంగునర్థక్షణమ్మునన్ సరసులార! 80

తే. గీ. అకటకట! పట్టి యూన నాయాసపడక
కుత్సితిం బూనకెందు సంకోచమెడలి
భాగవతసూక్తిఁ గైవల్య భవ్యపద ప
రీక్షుగనుఁడయ్యె సాక్షి పరీక్షితుఁడుగ. 81

ఉ. శ్రీశుకమూర్తి చిద్రస సరిద్వర వీథులఁ దేలి తేలి, యా
శ్రీశుకథాసుధారసము చిందెను ముద్దులుగుల్కు పల్కులన్
లేశము సంశయింపక విలీనులరై యది గ్రోలి సర్వలో
కేశునితోడ నైక్యము వహింపుఁడు సాధుజనావతంసముల్!

చ. వరనిగమాగమాబ్ధి దఱువన్ దఱువన్ గడుగోప్యమా రమా
వరచరితామృతం బఖిల భక్తసుధీజన జీవనంబుగా
ధరఁ బదిరెండు భాగముల దక్కెను శ్రీశుక వాక్యపద్ధతిన్;
బరసుఖవాంఛగల్గు జనవర్గము దానిని గ్రోలుఁడాదృతిన్. 83

శా. ఈగాథన్ హరిదాస సన్నిధిని దా నేకాగ్రనిష్ఠావిధిన్
యోగస్ఫూర్తిఁ బఠింపవిన్న శుభముల్ యోగించు, నాపై రస
శ్రీగంభీర తరంగ డోలికలపై శ్రేయఃపదావాప్తిమై
నూగన్ నేర్తురు రాజహంసలయి యత్యుత్సాహులై సాధువుల్.

క. ధైర్య హిమాలయ! వరగాం
భీర్య రసాలయ! యవక్ర విక్రమనుత! సౌం
దర్య కళాలయ! కలితౌ
దార్య! నతాభయద లీల! దశరథబాలా! 85

మాలికాబంధము.

చ. నరవర సారకారణ! గుణప్రణయా! పరవీరదారణా
దర! ధరణీరమా యుత! నత శ్రిత మానవ భావనావశం
కరచరణారవింద! కవికల్పక! మానసవాస! వాసనా
జ్వరహర వీరరాఘవ! శివస్తవనీయ కథాకలాకరా! 86

## హంస శ్రేణి

అంసోదంచద్ధను ర్రభిరామా!
సంసారోత్తారక జయనామా!
స్రంసన్నానామునిజనఖేదా!
హంసశ్రేణీ హృదయ వినోదా! 87

## మంగళ మహశ్రీ

శ్రీరఘుకులాంబుధిశశీసుమధురాకృతివశీకృత సమస్తమునిభావా!
చారుతరధర్మ సువిచారణవిశారద ! దిశాంరచితకీర్తిరుచి సారా!
మారుతిసమేత! శ్రితమానవశుభంకరరమాహృదయవారిజవిహారా!
ధీరజనవంద్యనయ దీక్షిత కవిస్తుత కృతిప్రియ మంగళమహశ్రీ! 88

గద్య. ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్షవీక్షా సమాసాదిత
కవితాకళాంచిత శ్రీవెంకటసుబ్రహ్మణ్యదీక్షిత ప్రణీతంబైన
భాగవత మాహాత్మ్య మను ప్రబంధమున

—: షష్ఠాశ్వాసము :—

సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ



# సవరణ

| పుట. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| కృతిసమర్పణము | 19. | కృతిన్యారత్న | కృతికన్యారత్న |
| తుది పంక్తిలో | | గళారవిలాస | గళావిలాస |
| 29 | 17. | ఇందెకాంబోలు బ్రహ్మానందగసమూర్తి | ఇందెకాంబోలు నానంద సుందరమూర్తి |
| 61 | 17, | మత్తేభ గర్భసీము | మత్తేభ గర్భసీసము |
| 69 | 12. | కళాచాతుర్య | కళాపరిఖ్యాత |

